

# స్ఫులింగాలు తుషారాలు

(ముక్తకాలు)

బెజవాడ గోపాలరెడ్డి




పరిశీలన

డాక్టరు అమరేంద్ర, M.A., Ph.D.

# స్ఫులింగాలు - తుషారాలు

(ముక్తకాలు)



బెజవాడ గోపాలరెడ్డి

పరిశీలన

డాక్టరు అమరేంద్ర, M. A., Ph.D.

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్‌రోడ్డు, హైదరాబాదు-1

# గ్రంథకర్త జీవన వివరాలు

| | |
|---|---|
| జననము — | 5 ఆగస్టు, 1907<br>బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.<br>తండ్రి – పట్టాభిరామరెడ్డి<br>తల్లి – సీతమ్మ. |
| చదువు — | బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.<br>ఆంధ్ర జాతీయ కళాశాల<br>(1921-24).<br>విశ్వభారతి<br>(1924-27). |
| సమరపర్వము — | సర్కారుబడి వదులుట జనవరి 1921.<br>జైలుశిక్షలు – ఆరు మారులు.<br>1930, 31, 32, 33 లోను,<br>1940, 41, 42, 43 లోను,<br>కొంతభాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు<br>4సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల<br>ఖైదీగా, డెటిన్యూగా. |
| ఉద్యోగపర్వము — | మంత్రిగా – మద్రాసు, కర్నూలు,<br>హైదరాబాదు, ఢిల్లీలలో – 186 మాసాలు<br>గవర్నరుగా – ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు<br>ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్ –<br>జూన్ 1951 నుండి 57 వరకు. |
| సాహిత్యపర్వము — | తెలుగు భాషా సమితి అధ్యక్షులు – 1948 నుండి<br>ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ – ఆగస్టు<br>1957 నుండి డిసెంబరు 1982 వరకు<br>కేంద్ర సాహిత్య అకాడమీ రెండవతూరి –<br>1978 జనవరి నుండి 82 డిసెంబరు వరకు,<br>83 జనవరి నుండి<br>జ్ఞానపీఠము – 1963 నుండి 1971 వరకు. |

# బెజవాడ గోపాలరెడ్డి

## పుస్తకాలు

**వేయి సోయగములు**

'ఆమె' పంచకము

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1982)

**శతకవితలు**

'కవితా' పంచకము

6. కాలవాహిని (1979)
7. సాహిత్య సుందరి (1980)
8. ప్రసూన మంజరి (1981)
9. పరిమళ తరంగాలు (1982)
10. సాగర సమీరాలు (1983)

**స్ఫులింగాలు - తుషారాలు**



**రానున్నవి**

మలయ మారుతాలు

(వివిధాలు)

**అనువాదాలు (ఉర్దూ నుండి)**

ఇక్‌బాల్ ఫిర్యాదు - జవాబు

ఇతర కవితలు

ఆత్మగరిమ

**బెంగాలీ నుండి (రవీంద్రునివి)**

1. రవీంద్రుని నాటికలు (5 పుస్తకాల సంపుటి)
2. కథలు - కల్పనలు
3. వానచినుకులు
4. ఊర్వశి - కాళిదాసు
5. నైవేద్యము - స్మరణ
6. తాజ్‌మహల్

అంకితము

స్వర్గీయ డాక్టరు రాయప్రోలు సుబ్బారావుగారి

(1892 - 1984)

స్వర్గీయ దువ్వూరి రామిరెడ్డిగారి

(1895 - 1947)

—దివ్యస్మృతికి

స్ఫులింగాలు          తుషారాలు

(ముక్తకాల రెండు పుస్తకాలు)

# నివేదన

ముక్తకాల ఐదు పుస్తకాలను వేయి సోయగములు లేక ఆమె పంచకము పేరుతో ప్రచురించినాను. 1. ఆమె, 2. ఆమె జాడలు, 3. ఆమె నీడలు, 4. ఆమె తళుకులు, 5. ఆమె చెణుకులు. రచన 1982 జూలైలో పూర్తికాగా, ప్రచురణ 1983 సెప్టెంబరులో జరిగినది. నా కవితా విహంగానికి రెండు రెక్కలు. నూరుకు మించిన దీర్ఘ కవితలు- 5 సంపుటాలు, 2) వేయికి మించిన ముక్తకాలు- 5 సంపుటాలు. 77 మే మాసములో ప్రారంభమైన నా సొంత కవితల ఉద్యమము 83 లో పూర్తియైనదని సంతసించాను. సంకల్పించిన సాహిత్య క్రతువు ముగిసినదని తలచినాను. కాని అంతటితో అది ఆగలేదని నేను ఊహించలేదు. అనుకోని పెద్దవి చిన్నవి ఘటనలు జీవితములో జరుగు చున్నవి గదా! నిన్నటి విషయము తెలియును గాని రేపటి విషయాలు భవిష్యత్తు సురంగములో దాగే ఉండును.

83 మార్చిలో తమిళ జిల్లాల ప్రయాణములో, రైలులో కొన్ని ముక్తకాలు వ్రాశాను. ఆమెలకు స్వస్తి చెప్పినాను కాబట్టి స్ఫులింగాలు అను పేరు పెట్టినాను. రెండు వందలకు పైగా అయి పుస్తక రూపము వహించినది. 83 ఆగస్టుకు తర్వాత మరికొన్ని వికసించినాయి. నా తోటలో వానికి తుషారాలు అని పేరు పెట్టినాను. ఇవీ 220 వరకు అయినాయి. ప్రస్తుత పుస్తకము పుస్తకాల జంట. కలిపే ప్రచురణ. ఇదీ దీని చరిత్ర. ఇప్పటికీ ముక్తకధార ఎండిపోలేదు. నేటివరకు ఇంకొక 50 వరకు వ్రాసినాను. వీనిని వీచికలు అని పేరు పెట్టినాను. పుస్తక రూపానికి చేరుకోగలవో లేదో నేను చెప్పలేను. ఆమె పంచకములోని 1085 ముక్తకాలతో కూడా 1500 కు పైగా అయినవి. మెదడును శ్రమ పెట్టేవే.

ఛందస్సులు, నియమాలు నిషేధాలు లేకుండుటచే భాషా విషయములో స్వేచ్ఛతో వ్రాశాను. వ్యాకరణ మానదండాలతో వీనిని కొలవవద్దు. భావాల విషయములోను అదే స్వేచ్ఛ. వ్యక్తుల దూషణలు లేవు. అసభ్యములు లేవు. మతద్వేషాలు లేవు. భాషాద్వేషాలు లేవు.

నడవడిలోను, భావాలలోను, భాషలోను విశుద్ధతను గుబాళించే డాక్టరు అమరేంద్రను ముందుమాటను వ్రాయమని కోరితిని. వారు అంగీకరించి వ్రాశారు. కృతజ్ఞతలు. ముందుమాటలలో సహధారణముగ స్తుతులుంటాయి. విశ్లేషణ తక్కువ. నేను అభిలషించేది విశ్లేషణ. విమర్శ అనే పేరుతో చాలా దొర్లుతూ వుంటవి. స్తుతివల్ల లాభం లేనట్లే, సానుభూతిలేని విమర్శ కూడ అంతే. వ్యక్తిని కాక పుస్తకాన్ని గూర్చి చెప్పాలి. పుస్తకాన్ని రసహృదయముతో పరీక్షించాలి. సమదృష్టితో విశ్లేషణ చెయ్యాలి. డాక్టరు అమరేంద్ర అట్టి గుణ సంపన్నుడనే విశ్వాసముతోనే కోరితిని. ఇంగ్లీషులో, తెలుగులో ఎంత బాగా వ్రాస్తారో, అంత బాగా మాట్లాడుతారు. ఆత్మస్తుతి పరనిందా లేని వ్యక్తి. చాల నాళ్ల నా కోరిక తీరింది.

నా సొంత శ్రద్ధ, అభిమానాల పురస్కరించుకొని డాక్టరు రాయప్రోలు సుబ్బారావుగారికి, శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారికి అంకితము.

ముద్రణలో సహకరించిన వారందరికి నా ధన్యవాదాలు.

శాంతి నికేతన్
నెల్లూరు-3
29-10-1984

బెజవాడ గోపాలరెడ్డి

# అనుశీలన

—"అమరేంద్ర"

పదేడులు నిండేదాకా తమ కవితాశక్తిని గురుదేవ రవీంద్ర కవీంద్రుల కావ్యాలనూ, రూపకాలనూ, ఉర్దూ కవివరేణ్యుడు ఇక్బాల్ రచనలనూ అనువదించటంలో ప్రదర్శించారు. సప్తతి దాటిన తరవాత స్వతంత్ర రచనలకు ఉపక్రమించి తమ పరిణత కవితా శక్తికి నిదర్శనలుగా పది కావ్యాలను వెలయించారు గోపాలరెడ్డి గారు. "నేను కవితా సభలోకి ఆలస్యంగా వచ్చాను" అని ఒప్పుకుంటూ "నేను కవితా ప్రాంగణమున నవీనుడను. వయస్సు పెద్దవాడను. జరా దౌర్బల్యము ఇంకా పొడ సూపలేదు" అని తమలోని అనంత నవవసంత వైభవాన్ని అక్షర రూపంలో ప్రకటించడానికి ఉద్యమించారు.

శ్రీ గోపాలరెడ్డిగారి జీవితకాలంలో అధిక భాగం రాజకీయోద్యమాలలోనూ, ఉన్నతాధికార నిర్వహణలోనూ గడిచినప్పటికీ ఆయన రసజ్ఞతను పదిలంగా కాపాడుకోగలిగిన విశిష్టవ్యక్తి. రాజకీయ కాసారంలో నీటి అలలపైన సోయగాలు వెదజల్లే రాజీవం రెడ్డిగారి వ్యక్తిత్వం. ఆయన జీవిత వసంత కాలం శాంతినికేతన తరుచ్ఛాయలలో గడిచింది. "ఆనాడు నాటిన విత్తనాలే 1977 మే మాసంలో మొలకలెత్తినవేమో!" అని తమ సారస్వతాభినివేశానికి అంకురార్పణ జరిగిన ప్రాయాన్ని తలుచుకుని మురిసిపోతారు. "రవీంద్రుని వ్యక్తిత్వము, సంగీతము, సాహిత్యము నన్ను సమ్మోహితపరచాయి. వారిని చూస్తున్నప్పుడు, వింటూ వున్నప్పుడూ సాహిత్యహిమాలయ పాదమూలమున కూర్చున్నట్లు అనిపించేది" ఆనాడు పడిన చెదరని ముద్ర గోపాలరెడ్డిగారి హృదయంలో నిలిచిపోయింది. రవీంద్రుని భావనావిలసనమూ, పదలాలిత్యమూ, సుకుమార సమాస రచనా విన్యాసమూ ఆయనను ముగ్ధుని చేశాయి. ఈ విశాలసృష్టిని ఒక విలక్షణమైన దృష్టితో పరిశీలించి జీవితంలోని వెలుగు చీకట్లనూ, శిఖరాలనూ, లోయలనూ, మానవ స్వభావంలోని మంచి చెడుగుల పడుగు పేకల అల్లికనూ అవలోకించి

చిత్రించే నైపుణ్యాన్ని గోపాలరెడ్డిగారు అలవరుచుకోగలిగారు. కవితా గంధంతో భాసించే వచన రచనలో తమ హృదయ స్పందనలు వినిపించటానికి పూనుకున్నారు. "వచనయుగ మిది. స్వేచ్ఛాయుగ మిది" అనే విశ్వాసంతో వచనంలోనే తమ ఆశయాలనూ, స్వప్నాలనూ, ఆనందాలనూ, నిర్వేదాలనూ, ప్రశంసలనూ అభిశంసలనూ ప్రకటించటానికి ఉద్యమించారు. "ఇందు బాహ్యారూపాలు, చమత్కారాలు, వినోదాలు లేవు. సంగీతము లయ కూడ లేదనే చెప్పాలె. అట్టి నిరలంకారమైన శైలిలో కల్పనాభావనతో కూడిన కవిత్వము పుట్టించడం తేలిక కాదు. వెదురు తునకను వేణువుగా తీర్చిదిద్ది మంజుల రాగ రాగిణులు పుట్టేంత శిల్పము కావాలి. సూటిగ చెప్పే శైలిలో కవితా బీజాలు నాటాలి" అని తమ మార్గాన్ని వివరిస్తూ అందులో ముందడుగు వేయటం ఎంతకష్టమో గోపాలరెడ్డి గారే వివరించారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఈనాడు పద్యాల ప్రాబల్యం తగ్గి వచన కవిత బహుముఖాలుగా విజృంభిస్తున్నది. ఏ శుభముహూర్తాన క్రాంతదర్శి శ్రీశ్రీ గద్యాన్ని పద్యానికిచ్చి పెళ్లి చేద్దాం అన్నారోకాని ఆ కల్యాణ తూర్యారావాలతో ఈవేళ దిక్కులు మారు మ్రోగుతున్నాయి. ప్రజలకు దగ్గరగా వెళ్లటం కోసం తన ఆకాశాలను లోకాలకు చేరువగా తన ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వల జడిగా వెదజల్లటం కోసం ప్రగతికవులు ఛందో బందోబస్తులన్నీ ఛట్‌పట్ మని తెంపేసి యతి ప్రాసలను తోసి పారేశారు. కాని అంత్య ప్రాసను కోరుకున్న కొత్త సంకెలగా తగిలించుకున్నారు. అస్పష్టమైన సంకేతాలనూ రూపకాలనూ వినియోగించి ప్రౌఢ ప్రబంధ సంస్కృత శబ్దాలనూ సుదీర్ఘ సమాసాలనూ ప్రయోగించి లక్ష్యసిద్ధికి దూరంగా జరిగిపోతున్న వచన కవులు చాలా మంది కనిపిస్తారు. మార్క్సిస్టు సిద్ధాంతాలకూ, సాయుధ విప్లవ ప్రబోధానికి, భారత సంస్కృతీ దూషణకూ ఈనాడు వచన కవిత కట్టుబడి పోతున్నది. ఈ నేపథ్యంలో చూసినప్పుడు గోపాలరెడ్డి గారి రచనలను కవితా వచనం అనాలనిపిస్తుంది. లలిత సుకుమార భావనలు రెక్కలు విప్పుకున్న విహంగాలలాగా హృదయంగమంగా విహరిస్తూ ఆకర్షిస్తాయి గోపాలరెడ్డిగారి అక్షర విహాయస వీథుల్లో. కళను దాచటంలోనే కళ వుంది ("Art lies in concerling art") అనే సూక్తికి తార్కాణం వీరి కవిత.

"కుదించి చెబితే ఒక అందం కవితకు
వర్ణనలతో వివరించి చెబితే మరొక అందం

బాలచంద్రునిలో ఒక అందం
దశమి చంద్రునిలో మరొక అందం" అని గోపాలరెడ్డి గారు గ్రహించి కొన్ని కవితా ఖండికలలో విస్తృతినీ మరికొన్నిటిలో సంక్షిప్తతనూ సాధించారు. అన్నిటిలోనూ స్పష్టతను లక్ష్యంగా గ్రహించి సూటిగా తేటగా చెప్పదలుచు కున్న భావాన్ని తమ సొంత బాణీలో ప్రకటించారు.

మారిపోయే కాలాన్ని చూస్తూ మూగగా సాక్షీభూతులుగా నిలిచిన మా ఊరి రావిచెట్టు, మైలురాయి, వంటి కవితా వస్తువుల ద్వారా మరుపురాని సత్యాలను సర్వజనీనంగా ప్రకటించారు. "గణాల మాత్రల సంగీతము లేకుండ, అంత్యప్రాసల వినోదాలు లేకుండ" తమ హృదయ స్పందనను పాఠకులలో ప్రతిస్పందింపజేసే స్వచ్ఛంద రచనా విన్యాసాన్ని ప్రదర్శించే సుదీర్ఘమైన కావ్య ఖండికలు ఎన్నో వెలువరించారు. "వృద్ధాప్యపు పర్వతము మీద కూర్చొని సంధ్యా కాంతులలో, నడిచొచ్చిన బాటను చూస్తూ" ఎన్నో స్మృతి చిత్రాలకు కవితా కృతిని కల్పించారు. తాజ్‌మహల్, విశ్వశిల్పి, శకుంతల వంటి సుదీర్ఘ రచనల్లో ఆయన భావ ప్రస్తారం గాయక చక్రవర్తి రాగాలాపనలాగా సాగుతూ ఎన్నో వొంపులూ సొంపులూ తిరుగుతూ ఇంపు గొలుపుతుంది. "దుఃఖనీరధిలో పొడిచిన భానుబింబం.. అద్భుతకళారత్న మంజూషము, అక్షయ సౌందర్య మధుభాండము" అని తాజ్ మహలును ప్రస్తుతించారు. "వేదనాహాలాహలమును తానే మ్రింగి, చక్రవర్తి చిరసౌందర్యరస పీయూషధారల మనకై వర్షించెను" అంటూ వేదన మాధురిగా రూపాంతరం పొందే సకల కళారహస్యాన్ని అవలీలగా అందించారు. తాజ్‌తో తులతూగే నల్లరాతి మక్బరా యమునానదికి అవలి తీరాన నిర్మించుకోవాలనే షాజహాను సంకల్పం నెరవేరలేదు.

"లేకున్న
తెల్లచలువరాళ్ల తాజ్‌మహల్,
ఎదురుగ నల్లచలువ రాళ్ల మక్బరా
వెలసి యమునానీరములలో
తమ అందాల తొంగి చూచుకునేవి
రాధ ఎదురుగా కృష్ణుని వలె" అనే అందమైన కల్పన చేశారు.

సాగరసమీరాలు, పరిమళతరంగాలు అనే అందమైన మకుటాలతో వెలసిన కావ్యసంపుటాలలో ఎన్నో కమనీయమైన దీర్ఘరచన లున్నాయి. గోపాలరెడ్డిగారి

సుదీర్ఘ రచనల్లో విశిష్టస్థానం అలంకరించే రచన విశ్వశిల్పి. సాధారణంగా కనబడే విషయాలలో దాగిన అసాధారణ సౌందర్యాన్ని దర్శించి ప్రదర్శించి కవిచక్షువు ఈ ఖండికలో విస్ఫారితమై విస్మయం కలిగిస్తుంది. తరులలో, విరులలో, గిరులలో, ఝరులలో, ఇరుల తెరలలో, వెలుగు వెల్లువలో దోబూచులాడే విశ్వశిల్పి విన్యాసం చూసి ముగ్ధులై సృష్టి శిఖరాగ్రాన్ని అధిరోహించిన మానవుణ్ని దుఃఖ గరళాన్ని కంఠానదాల్చిన నీలకంఠుడుగా, శోకగుండాల్లోపడి తెప్పరిల్లుకుని సత్యాన్వేషణ సాగించే నిత్యయాత్రికుడుగా, అనురాగాల కవచం ధరించి సంసార సమరం సాగించే సైనికుడుగా చిత్రించారు. మర్త్యలోకం కంటే మృత్యులోకం సుందరతరంగా అలరారుతుందనే ఊహతో విశ్వశిల్పికి ప్రణామంచేశారు. ఆ మహా శిల్పి కంటికి కనబడని భువన మోహనుడు, నిత్య సుందరుడు. ఆయనను ఏ రూపమూ బంధించలేదు, ఏ నామమూ అనుసంధించలేదు. రవీంద్ర గురుదేవుల భావనా సౌరభం గుబాళించే ఈ రచన గోపాలరెడ్డిగారి కవితకు విజయకేతనం. మరి సాహిత్యసుందరిలో అనాఘ్రాతపుష్పం శకుంతలను గురించి

"శకుంతల ఎక్కడ పుట్టిందో
ఎక్కడ తేలిందో!
జీవితమంతా కన్నీటి కాల్వలే
తండ్రి వద్దంటే, తల్లి వదిలేస్తే
ముని శపిస్తే, భర్త కాదంటే

మిగిలిందేమి జీవితంలో!" అంటూ కాళిదాసు శకుంతలను తన కమనీయకల్పనతో సౌందర్యామృతంతో అభిషేకించి చిరంజీవిని చేసినందుకు కవికుల గురువుకు నివాళులర్పించి ఆయన కావ్యసప్తకాన్ని సంగీతంలోని సప్తస్వరాలుగా భాస్కరుని సప్తాశ్వాలుగా ప్రశంసించిన తీరు ఎన్నటికీ మరుపురానిది.

సాధారణంగా వయసు మళ్లిన వాళ్లు వర్తమానాన్ని ఈసడిస్తూ, భవిష్యత్తుని ఊహించి బెదిరిపోతూ, గత వైభవాలనే నెమరు వేసుకుంటూ వెనక్కి వెనక్కి బెంగగా చూస్తూవుంటారు. 'గత కాలమె మేలు వచ్చు కాలము కంటెన్' అని వాపోతూ వుంటారు.

"ఆశాకరదీపికలతోనే సాగాలె
మన వికసన ప్రయాణం

ఏ దూరదిగంతాల శిఖరాలకో

ఏ జ్ఞానసాగర అగాధాలకో..." అనే ఆధునికమైన పురోగమన శీలమైన, సాహసోపేతమైన, నిర్భీకమైన స్తవనీయమైన మన సత్యం గోపాలరెడ్డి గారిది. "సమాధికి లేదు మార్పు సజీవత్వానికి సంకేతం మార్పు" అన్నది ఆయన తీర్పు. అందుకే మారే కాలంతోపాటు మనిషి మనస్సు వికసిస్తూ, ప్రకృతి మాత కొంగు విప్పి అందించే బంగరుకాసులను అందుకుంటూ ఆశతో ముందుకుసాగాలి.

"డొంకకు కావల్సింది నడకలు,
రాకపోకలు, జనసమ్మర్దం,
కదలిక కావాలె, చలనము కావాలె
అవి లేనపుడు మొక్కలు, ముళ్లు చేరాయి
చలనములేని సంఘము కూడ అంతే" అని హెచ్చరిక చేశారు. జీవిత గీతానికి ప్రగతి శ్రుతి కావాలని ఆయన ఆశయం. జడతను వీడి చైతన్యంతో ముందడుగు వేయాలి. వ్యక్తులూ వ్యవస్థలూ అచలాయతనాలు కారాదంటారు.

ఈ మధ్య తెలుగు ఆడబడుచులు, తోబుట్టువులు అనే రెండు మాటలు విరివిగా తరుచుగా వినబడుతున్నాయి. తల్లులను గురించి భార్యలను గురించి, ప్రేయసులను గురించి గొప్పగా రాసిన కవులెందరో వున్నారు. కాని పసుపు కుంకుమలతో పరమపదించిన అక్కలను గురించి ఎంతో చక్కగా రాశారు గోపాలరెడ్డిగారు.

"మనతో పుట్టిపెరిగి మరో గ్రామానికి
కుటుంబానికి పోతారు.
మన మర్రిచెట్టు ఎక్కడో ఊడలు వేసినట్లుంటుంది
మన ఊరి మబ్బు ఎక్కడో వాన కురిసినట్లుంటుంది" అనే పాదాలు చదువుతుంటే Alexander Pope చెప్పిన కవితా నిర్వచనం జ్ఞాపకం వస్తుంది, ''Poetry is what has often been felt but never so well expressed''. మనందరి మనస్సుల్లో మెదిలే భావాన్నే మనం చెప్పలేనంత అందంగా చెప్పారు గోపాలరెడ్డిగారు.

ఇంకొక్క విషయం చెప్పాలి. వచనాన్ని ఇష్టం వొచ్చినట్లు విరిచి ఒక పంక్తి పొడుగ్గా ఇంకోటి పొట్టిగా రాసినంతలో అది వచన కవిత కాదు. భావాను

గుణంగా పాదం సాగుతుంది. ఆ కదలికకు తగిన తూగు, ఊపు, లయ అప్రయత్నంగా వస్తాయని వచన కవితలో మహోన్నత శిఖరంగా నిలిచిన అమెరికన్ కవి శేఖరుడు వాల్టు విట్మన్ అభిప్రాయం. అంతర్లీనంగా అటువంటి హొయలు లయలు గోపాలరెడ్డిగారి వచనంలో విరివిగా కనిపిస్తాయి. నేలబారు నడకని ఒక్క క్షణంలో అంతరిక్షయాత్రకు సిద్ధం చేస్తాయి. అటువంటి లయాన్విత వచనమే అసలైన కవితా వచనంగా పరిమళిస్తుంది. వస్తువు షేవింగ్ బ్రష్ అయినా, పుస్తకాల గది అయినా, డొంక అయినా, చూసే దృష్టిని బట్టి కావ్యగౌరవం సంపాదించుకుంటుంది.

"ఏరు, కన్నతల్లి కొండను మరిచింది
నిప్పు కన్నతల్లి కడుపు కాల్చింది"
"అగ్నికి ఎప్పుడూ ఊర్ధ్వదృష్టే
నీళ్లకి అధోదృష్టి"
"వాదానికి లొంగనిది
వ్యాఖ్యానానికి అంద దది
నిర్వచనానికి పట్టదది
అందాలకు అందని
అంద మది
ఆత్మకు తెలిసే
మర్మ మది" ఇటువంటి పంక్తులలో విశ్వజనీన సత్యాలు నూతన రూపాలతో సాక్షాత్కరిస్తాయి. అప్పుడే కవి పలుకు "సకల మానవ మానసముల సామ్రాజ్యమ్ము సలుపజాలిన" సత్యవాక్కుగా విరాజిల్లుతుంది. ఏంతో పాతవైనా ఎప్పటికప్పుడు కొత్తగా అనుభూతి కలిగించే సత్యాలకు సుందరాకారం కల్పించటంలోనే కవుల శక్తి వ్యక్తమౌతుంది.

వచన కవిత నుంచి తెలుగులో కాలక్రమాన సహజమైన పరిణామంగా మినీ కవిత బయలుదేరింది. కవి మనస్సులో మెరిసిపోయే భావ పరంపరకు, ఒక దానికొకటి సంబంధంలేకుండా విడివిడిగా తళుక్కుమనే ఊహలకు అక్షరాకృతి కల్పించటానికి మినీ కవులు ప్రయత్నిస్తున్నారు. తక్కువ పరిధిలో ఎక్కువ రసస్ఫూర్తి కలిగించాలని వీరి ఆశయం. పూర్వ కవులు ముక్తకాలలో శతకాలలో సాధించిన క్లుప్తతను వీరూ తమ లక్ష్యంగా గ్రహిస్తున్నారు.

రవీంద్ర కవీంద్రులు జపాన్ సందర్శించినప్పుడు వాళ్ల సాహిత్యంలో బహుళ ప్రచారం పొందిన హైకూ అనే సంక్షిప్త రచనలకు ముగ్ధులైనారు. ఆ శైలిని అనుకరించి బెంగాలీలో కణిక అనే ప్రక్రియను సృష్టించారు. భావనా వైచిత్రితోనో, ఉక్తి చమత్కారంతోనో మనస్సును గిలిగింతలు పెడుతూ, ఆపాత మధురంగానూ, ఆలోచనామృత శీకరాలుగానూ అలరించే రచనలుచేశారు. వీటిలో కొన్ని Firaflies, Stray Birds అనే సంకలనాలలో ఆంగ్లరూపం ధరించాయి. ఉర్దూ సాహిత్యాధ్యయనంచేసి ఆ భాషలో వెలసిన కావ్యాల సొగసులను ఆస్వాదన చేసిన గోపాలరెడ్డిగారు ముక్తక ప్రాయములైన రచనలకు ఉపక్రమించారు. ఇప్పటికి తెలుగులో సహస్రాధికంగా ముక్తకాలు రచించిన ఘనత వారికే దక్కుతుందేమో ! తెలుగులో వచనకవితకు శ్రీకారం చుట్టినది ఆయనే !

"ఆమె"తో ప్రారంభమైన ముక్తకాల రచన ఆమె పంచకంగా కొనసాగింది. "ఆమె పంచకము రామాయణమైతే స్ఫులింగాలు, తుషారాలు ముక్తకాల ఉత్తర రామాయణము" అంటున్నారు. స్ఫులింగాల తరవాత తుషారాలు గ్రీష్మాతపం తరవాత తొలకరిజల్లులు కురిసినంత సహజంగా అమరినాయి. స్ఫులింగాలలో 220 ముక్తకాలు, తుషారాలలో 221 ముక్తకాలు. ఈ ముక్తకాలు హారంలో కూర్చని పుష్పాలు. కాని వీటి వెనకాల కనబడని ఒక అంతస్సూత్రం కవి వ్యక్తిత్వం. నేను అనే అద్దంలోనే లోకం ప్రతిఫలిస్తుంది. నేను అనే మూసలో ఈ లోకంలో కవి పొందే అనుభవాలు కరిగించిపోసిన మైనంలాగా చేరుకొని ఆకారాన్ని దిద్దుకుంటాయని ఎమర్సన్ పండితుడన్నాడు. ఒక ప్రత్యేక మనస్తత్వంలో ప్రతిబింబించిన విశ్వదృశ్యమే కళాఖండం అన్నా డొక విమర్శకుడు. గోపాలరెడ్డిగారి విశిష్టవ్యక్తిత్వం ద్వారా ప్రకటితమైన విభిన్న భావాలు, వివిధ సన్నివేశాలు, విచిత్ర విలక్షణ వ్యక్తులు, విలువైన స్మృతులు, స్ఫులింగాలలో తుషారాలలో ముక్తకాలుగా వెలువడినాయి. మానవ జీవితం, ప్రకృతి సౌందర్యం, మానవస్వభావ పరిశీలన, వర్తమాన పరిస్థితుల అవగాహన, గతవైభవస్మరణ, ఉజ్జ్వల భవితవ్య సందర్శన, విశ్వమానవ సువిశాల భావన ఈ ముక్తకాలలో ముచ్చట గొలుపుతున్నాయి.

స్ఫులింగాలలో మొదటి రచన ఢిల్లీనగర చరిత్రను స్ఫురింపజేస్తుంది. పురాణ కాలంలో ఇంద్రప్రస్థంగా వాసికెక్కిన ఈ మహానగరం ఎన్నో సామ్రాజ్యాల వికాస వినాశాలకు సాక్షిగా నిలిచింది.

"కోకిల స్వరమెత్తిన వనములో గుడ్లగూబలా ?
విదికోరలు విప్పి కాటు వేసింది.
కాలహస్తము సౌభాగ్యప్రదీపాల ఆర్పివేసింది
రాజ్యాల ఊయలయైన ఢిల్లీనగరము
సింహాసనాల సమాధియై
యమునా నీరాలలో కరిగిపోయింది" అని ఆనగరపు గాథను దయ
నీయంగా చిత్రించారు.

ఎన్ని వైభవాలు అనుభవించి అందలా లెక్కి ఊరేగినా అనివార్యమైన పరిణామం మరణం. "అస్తమించటానికే ఉదయిస్తాడు సూర్యుడు. వాడి పోడానికే పూస్తాయి పువ్వులు. సమసి పోవుటకే లేస్తుంది అల" అంటూ

"ఏనుగులు ఎక్కిన ఏలికలు
పల్లకీలు ఎక్కిన పట్టపురాణులు
కారులలో కెక్కిన కోటీశ్వరులు
నరభుజాలు ఎక్కి అంతిమ యాత్ర చేస్తున్నారు" అని ఒక నిష్ఠుర
సత్యాన్ని చమత్కరించారు.

శబ్దంలో అర్థంలో చమత్కారం కనబడే ముక్తకాలు ఎన్నో వున్నాయి.

"కొందరికి లోకజ్ఞానం ఎక్కువ
కొందరికి లోకుల జ్ఞానం ఎక్కువ"

"ముద్దులకు నోచని పెదవులే
ముద్దుల పాటలు పాడేవి"

జీవితంలో ఎన్నో అన్యాయాలూ అక్రమాలూ దారుణాలూ దురాగతాలూ చూసి రోసి వ్యథిత హృదయంతో

"నీరు కార్చే కన్నులనే ఇచ్చావు
నెత్తురు కార్చే వానిని ఇచ్చివుంటే ఎంత బాగుండేది" అంటారు. ఈ
రెండు పంక్తులలో విశ్వమాత విశాలమైన వేదన ఇమిడివుంది.

మనిషి చేదు బతుకును మధురాతిమధురం చేస్తుంది స్నేహం. ఇతర ధనాలు దంధనాలు. కాని స్నేహధనం అక్షయం.

"అనుదినమూ క్రొత్త స్నేహితుని కలిసేవాడు
వేయిబ్రతుకులు బ్రతుకుతాడు
అనుదినమూ పువ్వులు పూస్తే
వేయి బ్రతుకులు బ్రతుకుతుంది వసంతవనము"

మిత్రులుకాని ప్రేయసీ ప్రియులు కాని కలుసుకున్నప్పుడు, ఈ సుఖం ఇదే విధంగా, ఇంతమధురంగా ఎక్కువ కాలం నిలవదేమో, మళ్లీ దీర్ఘమైన ఎడబాటు కలుగుతుందేమో అనే భయమూ బాధా కలిగితే సమక్షంలోనే విరహం అనుభవించవచ్చు. చాలా కాలానికి శ్రీకృష్ణుని సన్నిధి దొరికిన ఒక గోపిక ఈ ఆనందం క్షణికమేమో మళ్లీ వియోగం తప్పదేమో అని వ్యథ పొందుతుంది.

"భవిష్యత్తుకై ఆశంక వేధిస్తుంటే
సమక్షములోనే విరహం అనుభవించొచ్చు" అని ఒక చిత్రమైన మానసిక స్థితిని సూచించారు ఒక ముక్తకంలో.

వీరుల చరిత్రల సంపుటాకారమే జాతిచరిత్ర అన్నాడు తామస్ కార్లయిలు. వీరపూజ గోపాలరెడ్డిగారి ముక్తకాలలో ఎన్నోతావుల్లో తొంగి చూస్తున్నది. వినయంతో అంటారు

"నేను మంత్రిని కాకమునుపు
పెద్దలను వారి స్వగృహములలో దర్శించాను.
రవీంద్రుని ఉత్తరాయణములో
గాంధిజీని సబర్మతి ఆశ్రమములో
కాశీ కృష్ణాచార్యులను గుంటూరులో
చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిలను కడియములో
వేంకట రాయ శాస్త్రిలను నెల్లూరులో
కృష్ణశాస్త్రిని పిఠాపురములో
దువ్వూరి రామిరెడ్డిని పెమ్మరాజుపాలెంలో
రామస్వామి చౌదరిని తెనాలి సూతాశ్రమములో
నా జీవితములో గొప్ప భాగ్యమని తలచాను"

ఎవరి రంగంలో వారు దిగ్దంతులు. చరిత్రను సృష్టించిన మహనీయులు.

"రవీంద్రనాథ్, గాంధి
భారత దేశమును అలంకరించిన మానవ మేరు శిఖరాలు
ఏదేశమైనా ఏశతాబ్దమైనా గర్వింపదగిన
జనప్రియులైన మేధావులు
కళాదేవతల అనుంగుపట్టి ఒకరైతే
సత్యాగ్రహమను అహింసాస్త్రము నొసగిన
శాంతి సేనాధిపతి ఒకరైనారు"

"తెలుగు వారి చరిత్రలో
సర్వశ్రేష్ఠులగు ఆరుగురిని పేర్కొన యత్నించాను.
సద్గురు త్యాగరాజు, కవిగురువు నన్నయ్య
తిక్కన సోమయాజి, కృష్ణదేవరాయలు,
వీరేశలింగం విశ్వేశ్వరయ్యలు" రెడ్డిగారి నీ రాజనాలు అందుకున్నారు.

ఎన్నో రమణీయములైన ప్రకృతి దృశ్యాలు గోపాలరెడ్డి గారి సౌందర్యారాధనకు నిదర్శనాలుగా ముక్తకాలలో కమనీయంగా కనిపిస్తాయి.

"దట్టమైన పొగమంచు మాదిరి
చుట్టుకొన్నది వాన తువ్వల తెర అడవిని
అర్ధ స్ఫుటముగ అర్ధనగ్నముగ ఉన్నది దృశ్యము
వనదేతల జలక్రీడలకు వేళయైనదా ?"

"పర్వతములు ధ్యాన గంభీరములై
ఎన్ని సహస్రాబ్దములుగ నిలిచియున్నవో
కాలవైభవ మహిమల దాచిన పాషాణపు భోషాణాలేమో !"

"చందమామను పట్టటానికి
చెట్లు తయారయాయి
కొమ్మల చాపి చాపి ఊపి ఊపి ఎగసి ఎగసి యత్నించాయి
చందమామ చిక్కక నవ్వుతూ నిలబడ్డాడు
ఇంతలో మబ్బు దాసి వచ్చి
చంద్ర కిశోరాన్ని ఎత్తుకుని పోయింది"

"సంధ్యాకాశము
ఒంటిమీద విభూతిరేఖలు
నొసటను కుంకుమ బొట్టు
తాలిచి పురోహితుని వలె ఉన్నది.
రజనీ దేవికీ సుధాకరునికీ
దాంపత్యపు ముడులు వేయించాడు
చుక్కలు అక్షింతలు జల్లినాయి"

"నిద్రామాగాణములోనే విహరిస్తుంటాయి
స్వప్నాల హరిణాలు"

"నింగిలో చంద్రుడు పయనించుచున్నాడు
అప్పుడప్పుడు మబ్బుల మాటున చేరుచున్నాడు
వీధి వెలుగుల తప్పుకొనుటకు
కొంగు మాటున ముఖముదాచే
అభిసారిక జ్ఞాపకాని కొచ్చింది"

"చందన చర్చిత గాత్రయై
కుంకుమ తిలకలలాటయై
సంధ్యాదేవి బయలుదేరింది.

ఇటువంటి కల్పనలలో వున్న అందచందాలు రసజ్ఞులను అలరించగలవు.

"Poetry is at bottom a Criticism of life" అన్నాడు ఆంగ్ల విమర్శకుడు ఆర్నాల్డు. జీవితంలోని వివిధ విషయాలను గురించిన వ్యాఖ్యానాలు ముక్తకాలలో వినిపిస్తాయి. హిందూ మతాన్ని గురించి చేసిన విమర్శ ఆలోచనను ప్రేరేపిస్తున్నది

"బౌద్ధమతము దాటింది సముద్రాలను పర్వతాలను
క్రైస్తవ మతము ప్రాకింది ప్రపంచ సరిహద్దులకు
ఇస్లాం మతము ఆక్రమించింది ఆఫ్రికా ఎడారుల జావాద్వీపాల

హిందూ మతము కదలక మెదలక హఠయోగముతో కూర్చున్నది
వర్ణాశ్రమ జపమాలను త్రిప్పుచు కూర్చున్నది."

గోపాలరెడ్డి గారి దృష్టిలో ఉపన్యాసం విషయ వివరణతో విజ్ఞాన దాయకంగా వుండాలికాని హరికథలాగా వుండకూడదు. జ్ఞాపకశక్తి బలంవల్ల పద్యాలు గుక్కతిప్పుకోకుండా ఉటంకిస్తూ శ్రోతలను ఉక్కిరి బిక్కిరి చేస్తూ సొంత అభిప్రాయం ఒక్కటికూడా ప్రకటించని వక్తలను ఆయన అధిక్షేపిస్తారు.

"సభల్లో వ్రాతల్లో
విస్తారంగా ఉల్లేఖించేవారిని
చూస్తే జాలివేస్తుంది
సొంత ధ్వని లేదా సదా ప్రతిధ్వనులేనా వారు ?"

ఇచ్చిన గడువు పూర్తి అయినా ఉపన్యాస విషయం సగం కూడా తరగలేదు. పాటలూ పద్యాలూ రాగయుక్తంగా ఆలాపించిన ఉపన్యాసకురాలి ప్రసంగం విని బాగుంది హరికథ అనుకున్నారు శ్రోతలు అని పరిహసించారు ఒక ముక్తకంలో.

"56 సంవత్సరాల ఉద్యోగి పదవికి అనర్హుడని
60 సంవత్సరాలు నిండిన
ముఖ్యమంత్రి ఉత్తరువు వేశాడు
ఎందుకీ వరదల బెడదలని
గోదావరి తుంగభద్రను అడిగింది" అని చురక వేశారు ఒకచోట.

"అప్పులు ఎట్లా తీర్చాలని ఆలోచించకు
కొత్త అప్పులు ఇచ్చేవారిని వెతుక్కో"

"స్త్రీ ఎప్పుడూ నవ్వుచుండినా బాగుండదు
ఎన్నడూ నవ్వకుండినా బాగుండదు."

"ప్రజాస్వామికములో పదిమంది మేధావుల భావాలకన్న
నూరుమంది నిరక్షరాస్యుల భావాలకి విలువ"

"సమానత్వాలు మానవ జీవితాన్ని తంబురాను చేస్తాయి

ప్రత్యేకతలు సహస్రతంత్రీ విపంచిని చేస్తాయి." ఎంత పదునుగా చెప్పారో వైవిధ్యంలోవున్న విశేషాన్ని! ప్రత్యేకతను నిలుపుకుంటూ సమానత్వాన్ని సాధించటమే మానవ స్వభావానికి గర్వకారణం!

"మరుగుజ్జుల రాజ్యములో ఏలికలు నాయకులు

కొరతల రాజ్యములో ప్రచారకులు నాయకులు

అపదల రాజ్యములో ప్రబోధకులు నాయకులు" అన్న పంక్తులు నాయకుల బండారం బైట పెడుతున్నాయి.

రామారావూ నాగేశ్వరరావూ వనస్పతులట. వారితో నాయికలుగా నటించిన లతాంగులు లతాంతాలవలె వసివాడి కనుమరుగై పోయారని ఒక ముక్తకంలో అరవైలో ఇరవైని నటించే హీరోలని ఎత్తిపొడిచారు.

గోపాలరెడ్డిగారికి సంగీతమంటే ప్రీతి. ద్రుతలయ బద్ధమైన సంగీతం. రణవీరులకే కాదు ఉత్సాహాన్నిచ్చేది, జడ బుద్ధులను కూడ ఊపగలదు అంటూ శాస్త్రీయ సంగీతం వింటున్నప్పుడు పారవశ్యమూ సినిమా సంగీతం వింటూన్నప్పుడు నవ్వూ వస్తాయని చెప్పారు. దేహవీణకు యౌవనం ఆరోహణమని చక్కని రూపకం ద్వారా తమ గానప్రియత్వం ప్రకటించారు. కొన్ని ముక్తకాలలో సన్నివేశ చమత్కారం, సంభాషణా చమత్కారం తళుక్కుమంటాయి.

"జరూరు పనివున్నది పోవాలి. అరకప్పు టీ ఇప్పించండి.

తెచ్చేదాకా వుంటాను అని నేనంటే సంతసించి

జరూరు పని కాదన్నమాట అని చిరునవ్వు నవ్వింది."

ఇంకొక ముక్తకంలో కావాలని ఒక స్నేహితురాలింట్లో కళ్లజోడు మరిచిపోయి టెలిఫోనులో ఆమెతో మాట్లాడే అవకాశం దొరికిందని సంతోషించే సంఘటన వుంది. శ్రుతి తప్పని, హద్దుమీరని, స్థాయి దిగజారని శృంగారరస బిందువులుగా కొన్నిముక్తకాలు ఆనందింప చేస్తున్నాయి."

"శివుడు మన్మథుని ఓడించినది

తాత్కాలికముగా

మన్మథుడు శివుని ఓడించినది శాశ్వతముగా
లేకున్న శివుడు పార్వతి పాదములకడ వంగి
ఎందుకు అభ్యర్థన చేస్తాడు ?"

అని ప్రశ్నిస్తూ శృంగారము రసరాజమనే సిద్ధాంతాన్ని స్ఫురింపజేశారు.

కవిత్వాన్ని ఒక సుదీర్ఘ యాత్రగా మానవులను నిత్యయాత్రికులుగా భావించే దృష్టి గోపాలరెడ్డి గారిది.

"నిరంతర యాత్రలో
తొలిమజీలీ చేరాడు మానవుడు.
ఇంకా ఎన్ని మజీలీలో ఎన్ని అనుభవ వికాసాలో
ఎన్ని సహస్రాబ్దాలు గడవాలో
ఎప్పటికో ఆ నిత్యానందం?
ఆనిత్యానంద జ్యోత్స్న యామినిని భావిస్తేనే ఆనందమవుతుంది నేడు!"

సుదీర్ఘ రచనలైనా ముక్తకాలైనా గోపాలరెడ్డిగారు సమానంగా సమర్థవంతంగా నిర్వహిస్తారు

"నా ముక్తకాలు
హఠయోగములోని ఆసనాలు
ఊపిరి బిగబట్టిన కుదింపులు
దీర్ఘ కవితలు
విశాలక్రీడా భూమిలో విహారాలు"

అని తమ రచనా విన్యాసాన్ని అభివర్ణించారు.

ఈ రెండురకాల రచనా విధానాలూ గోపాలరెడ్డిగారు సాగిస్తున్న కవితా ప్రస్థానంలో మజీలీలే. కవితాధిదేవత తన పట్టుచీర కొంగున ముడివేసిన బంగరు కాసులు మూటను విప్పి వారికి ఒక్కొక్కటిగా అందిస్తూ మురిపిస్తూ కొత్త రచనలకు ప్రేరణకల్పించగలదని ఆకాంక్షిస్తున్నాను.

"కాలానికి ఏమికావాలె
కవియా కవిత్వమా

జీవిత వివరాలా, కవితాశిల్పమా
కవి వెంట కొనిపోయినాడు జీవితాన్ని
వదలి వెడలినాడు కవిత్వాన్ని
ఒకటి నశ్వరము మృతము

ఒకటి అనశ్వరము అమృతము" అని ఒక ముక్తకంలో ప్రపంచించారు. ఎన్నో ఉన్నత పదవులు పిన్నవయసునుంచీ అలంకరించిన గోపాలరెడ్డి గారు సప్తతి నిండిన తరవాత ఆధునికాంధ్ర సాహిత్యంలో కవిగా సంపాదించుకుంటున్న స్థానం సమున్నతంగా సుస్థిరంగా విరాజిల్లగలదని విశ్వసిస్తున్నాను. ఇతర పదవులకంటే గొప్పది కవి అనే పదవి. ఆ పదవిని అలంకరిస్తూ బ్రౌనింగ్ కవి పుంగవునిలాగా

"grow old along with me

The best is yet to be !" అని ప్రకటించే ఆశావాదం, జీవిత రసాస్వాదనం గోపాలరెడ్డి గారు ముక్తకాలలో మౌక్తిక దీప్తులతో మెరిపిస్తున్నందుకు ధన్యవాదాలు.



# స్ఫులింగాలు

అత్తరుల సువాసనలు గుబాళించిన చోట
చిరునవ్వుల వెలుగులు కటాక్షసౌదామినులు దీపించినచోట
వసంతరాత్రుల నూపురరవములు మ్రోగినచోట
ముషాయిరాల గజళ్లలో శృంగారభావములు లాస్యము చేసినచోట
నేడు అనాథల ఆక్రందనలా!
విగతభర్తృకల విషాద విలాపాలా!
బాలబాలికల ఆకలిమంటల రవ్వలా!
మూలిగే పీనుగలా, ఒదలిపై కాన్పించే ముసలి ముదతలా!
కోకిల స్వరమెత్తిన వనములో గుడ్లగూబలా!
మయూర సింహాసనమున కూర్చున్న సుల్తానులు బేగములు
చెరసాలబందీలా, ప్రవాస శిక్షితులా
విధి కోరలు విప్పి కాటువేసిందా!
కాలహస్తము సౌభాగ్యప్రదీపాల ఆర్పిందా!
రాజ్యాల ఉయ్యేలయైన ఢిల్లీనగరము
సింహాసనాల సమాధియై
యమునానీరాలలో కరిగిపోయిందా! 1

పాలనా దీపపువత్తులు బయట ఆరినవా!
లాల్‌ఖిల్లా ఆవరణల మధ్యనే వెలిగాయా!
చుట్టూచీకటి, లోపల వెలుగుచుక్క
చీకటి పెద్దది, వెలుగు చిన్నది. 2

దేశవిదేశాల ఏలిన పాదుషాలే
ప్రేమనికుంజాలలో
గుల్‌బదను (పూబోడి)ల గులాములే ! 3

అస్తమించడానికే ఉదయిస్తాడు సూర్యుడు
వాడిపోడానికే పూస్తాయి పువ్వులు
సమసిపోవుటకే లేస్తుంది అల
చచ్చుటకే పుట్టాడు మనిషి ! 4

ఏనుగులు ఎక్కిన ఏలికలు
పల్లకీల ఎక్కిన పట్టపురాణులు
కార్లల్లో ఎక్కిన కోటీశ్వరులు
నరభుజాల ఎక్కి అంతిమయాత్ర చేస్తున్నారు. 5

నిరాశల సందేశమే నిట్టూర్పు
పండని కోరికల రాయబారే కన్నీరు 6

అపేక్షల కాసారములో
    ఉపేక్షల నీలోత్పలాలు
యౌవనోత్సవములలో
        వెలుగని దీపాలు
        తెగిన వీణ తీగెలు 7

ముసలిచీకట్లు ఎలవెలుగులు
పందాలాడుచున్నవి వేకువన
    శుక్రతార సమక్షమున 8

పండితులకు ప్రశంసించుట చేతగాదు
భూరిదక్షిణలు వర్షించునప్పుడు తప్ప !
తమ ఆధిక్యత తరుగుతుందని భయము
దోషాల వెదకుటే పరిపాటి 9

కొందరికి లోకజ్ఞానం ఎక్కువ
కొందరికి లోకుల జ్ఞానం ఎక్కువ ! 10

ముక్తసరిగ మాట్లాడేవారితో
విస్తారముగ మాట్లాడడము ముప్పు ! 11

అపేక్షల వాహినులకు
ఉపేక్షల సైన్యాలకు
సమరాలు లోకప్రసిద్ధాలే !
తుది విజయము ఉపేక్షలకే
అపేక్షలకు మిగిలేది
నిట్టూర్పులే ! కన్నీరే ! 12

లోకానికి వెలుగునిస్తున్నానని కులికింది దీపము
క్రింద తొలుస్తున్న నీడ పురుగుల చూడలేని గ్రుడ్డి ప్రభువు ! 13

ముద్దులకు నోచని పెదవులే
ముద్దుల పాటలు పాడేది. 14

నా హృదయము రమ్యహర్మ్యాల నగరం
సౌందర్యాలు అనల శిఖలతో ధ్వంసము చేశాయి. 15

భిక్షకుని వేషాల్లో భిక్షమడిగాను
సౌందర్యవతులను !
ఔదార్యాలు కృపణత్వాలు
తిరస్కారాల విలాసాలు
ఎన్నో గమనించాను
బిచ్చం తక్కువ
అనుభవం ఎక్కువ గడించాను ! 16

దగ్ధమైన హృదయములో
వలపుగాయాల మచ్చ నిలిచిపోయింది

నల్లబడక ఎర్రగనే ఉన్నది మచ్చ!
ధ్వంసమైన నగరములో
ఏకైక దీపమువలె వెలుగుచున్నది. 17

దేవుడు ఒక్కడే
ఒకే మందిరములో పూజ చేస్తాను.
ప్రేయసులు పెక్కు
పెక్కు గుమ్మాలవద్ద కన్నీరు కారుస్తాను. 18

గాయాల ఎర్రపాదిలో
పెరగాలె వలపు తీగలు కవనాల మొగ్గలు. 19

గాయాల నెత్తురుతో తడవాలె
వలపు పువ్వులు వలపుపాటలు 20

దుఃఖాల కౌగిట చేరాను
నా వేదనాయుత ఆనందమును
పుస్తకముగ బయట వేశాను! 21

పగలంతా యాద్ (జ్ఞాపకము) లు
రేయి అంతా ఫిర్యాదులు
ప్రొద్దున ఫిర్ యాదులు (మరల) 22

దుఃఖాలు అనేకములు
సహించుటకు గుండె ఒక్కటే
ఏడ్చుటకు కన్నులు రెండే
దుఃఖాల దేవుడు
పెక్కు గుండెలను, పెక్కు కన్నులను
ఎందుకు ఇయ్యలేదో!
సహస్రాక్షుడు

అన్ని కళ్లతో ఏడుస్తాడు కాబోలు
ఇతరుల ప్రగతుల చూచి ! 23

గుండె మంటలను ఆర్పుటకు
కన్నీరు బండ్లు వచ్చాయి
నీరు ఇంకిపోయింది
గుండె మంటలు రేగుచునే ఉన్నాయి. 24

గులాబీలను మల్లెలను చేమంతులను
నుతింప మనసాడకున్నది
ప్రభాత సమీరాలవలె
తోటను పొగిడేవాడనుకాను కోకిలవలె
తిట్టేవాడను, నా దుఃఖాల ఆక్రోశముతో. 25

కవి అని ఎందుకు సన్మానిస్తారు ?
దాగిన అనేక దుఃఖాలను ఏరుకొన్నాను
పదాలలో బిగించాను
గోష్ఠులలో విలపించాను, అంతేగదా ! 26

అనుదినము క్రొత్తస్నేహితుని కలిసేవాడు
వేయి బ్రతుకులు బ్రతుకుతాడు !
అనుదినము పువ్వులు పూస్తే
వేయి బ్రతుకుల బ్రతుకుతుంది వసంతవనము. 27

కవి స్వయముగ సంవేదనతో మనాలె !
కంటకాలపై పరుండాలె !
ప్రసూనాల పంచిపెట్టాలె !
మకరందాల చల్లాలె ! 28

నీ వలపువేడికి ఆమె సౌందర్యము కరిగి పారకున్న
సౌందర్యము తరగలేదే !
ఆమె నడకల హొయలు
ఆమె పలుకుల సొరు
చూచి ఆనందించు
ఎంత ప్రాప్తో అంతకే సంతసించు !
లేమిలో సంతసాన్ని పుట్టించుకో ! 29
యాచనలోకూడ బ్రతుకుతీపుల అనుభవించు
దాతలలో కొంతమందిని ప్రేమించు
సంభాషణల జరుపు
నీ చేయి చాతకమై హస్తదానధారల క్రోలనీ ! 30
హృదయమా ! దుఃఖవిలాసాలను
మార్చుకో ! మూలసంపదగ
విషాదపాత్రలలో అమృతము అందుకో !
విషాదమదిరములో కైపును పొందుకో ! 31
నీరు కార్చే కన్నులనే ఇచ్చావు
నెత్తురు కార్చేవానిని ఇచ్చియుంటే ఎంతబాగుండేది ! 32
దుఃఖాలకు విరుగుడు సారా
వేదన మాన్పుటకు సారా త్రాగాను
రోగానికి మందు వేశాను
తప్పేమి ? లేకుంటే దుఃఖాలు లేకుండ చేయి ! 33
నేనేమి గద్దనా కాకినా దొరికిన విడువడానికి !
తియ్యనిపాటలపాడే గోరువంకను
పంజరములో ఉంచారు
పాటల విన్నారు
రెక్కల త్రుంచారు. 34

విలపించడమే నా వృత్తి నా ప్రవృత్తి !
ఎన్నాళ్ళు నా విలాపాలతో సమరము
కన్నుల నీరు తుడిచి తుడిచి
పంచ మబ్బై బొట్టుల కార్చింది. 35

చంద్రకళంకము చూడాలంటే
పౌర్ణమియే సరియైన దినము
కళంకాన్ని ఎంత సేపు చూచినా
పౌర్ణమి పౌర్ణమియే ! 36

ఆమె అందరిని దగ్గర చేర్చేను
ఎవరిని అంటించుకో లేదు
ఎవరిని చుట్టుముట్టించుకోలేదు
అందరిని సరియైన దూరముననే ఉంచేను. 37

అందరికి ఆర్జనమీదే దృష్టి
ఆమెకు సద్వినియోగముమీదే దృష్టి
దానధర్మాలమీదే తలంపు
సర్వదా అదే చింత, అదే విచారము. 38

ముందుజన్మ పునాదులు
ఈ జన్మలోనే వేస్తాము
వెలుగు చూడని జీవన రహస్యాలు
తీరని కోరికలు
తీర్చని బాకీలు
మళ్ళీ రమ్మని పిలుస్తాయి. 39

నేపథ్య రహస్యాలను
వినుటో చూచుటో ఉచితముకాదు
అందరికి చెప్పడం సుతరాం ఉచితము కాదు 40

జరూరు పని ఉన్నది పోవాలె
కాని పోవడము ఇష్టంగా లేదు !
కొంతసేపు ఉంటాను ఇచ్చటనే
అరకప్పు టీ ఇప్పించండి !
అని నేనంటే సంతసించి
జరూరుపని కాదన్న మాట
అని చిరునవ్వు నవ్వింది ! 41

విరహము శృంగారపరంగ వాడ్తాము
ప్రియమిత్రులమధ్య విరహం ఉండొచ్చు
ప్రీతి మైత్రి ఉన్నచోట విరహం ఉండొచ్చు
భవిష్యత్తుకై ఆశంక వేధిస్తుంటే
సమక్షములోనే విరహం అనుభవించొచ్చు. 42

కుటుంబము రాగయుక్తముగ ఉన్నది
రామదాసు కీర్తనవలె !
కోరిన చుట్టాలు వస్తే స్వరవిస్తరణగుతుంది
త్యాగరాజు కృతివలె !
స్నేహితులూ చేరితే
బరువుగ హుందాగ
దీక్షితుల కీర్తనగుతుంది !
సంగీతము ఎన్నిరకాలు ! 43

ఎరుక లేకనే
నీ ఊర్పులతో చేరి
సౌరభము వలె కోరిక
నీ హృదయములో ప్రవేశించింది
దాని గుసగుసలు

నీ పలుకులలో ప్రకటితమగుతాయి !
అట్టి కోరిక వలదని ఒప్పవు
కావాలని ఒప్పవు
నీకే సిగ్గగుచుంటుంది !. 44

మీ పసివానిని గూర్చి పద్యము విన్నారు
సంతసమును చిరునవ్వులలో చూసారు
ఏమిస్తారు కవికి అని అడిగాను.
అగ్రహారాలా, పుష్పహారాలా, ఫలహారాలా !
మీ పసివానినిగూర్చి పద్యము విన్నారు
సంతసమును చిరునవ్వులలో చూసారు
ఏమిస్తారు కవికి అని అడిగాను
అగ్రహారాలా, పుష్పహారాలా, ఫలహారాలా !
అని ఆహ్లాదముగ అడిగాను
ఫలహారాలు ఇప్పుడే తెస్తాను
పుష్పహారాలు తెప్పించి ఇస్తాను
అగ్రహారాలు మీ పాలనలోనే
రద్దుచేశారు కదా ! ఇంకెక్కడివి ?
కర్పూరమువలె మాయమయ్యాయి
అంటూ లేచి ఫలహారాలు తెచ్చింది ! 45

ఆమె సభలోనికి వచ్చింది
వయస్సు వెనుకకు నడుస్తున్నట్లు తోచింది !
అందంగ కాన్పించింది.
నేను తలచిన మాటలు
ఆమె హృదయ కర్ణములు విన్నాయా ?
ఎప్పుడూ పలుకరించని ఆమె
చూపులతో చిరునవ్వులతో పలుకరించింది

వచ్చేటప్పుడు వ్రేళ్ల ఆడిస్తు సెలవు ఇచ్చింది !
ఏమిటీ, ఈ క్రొత్త మౌన సంభాషణలు ? 46

అందాల చిన్నది
కన్ను పెద్దది !
ఏనుగు పెద్దది
కన్ను చిన్నది ! 47

మాటల్లో పొదుపు
వ్రాతల్లో పగతీర్చుకొన్నది
అవసరముకన్న తక్కువ మాటలు
అవసరము కన్న ఎక్కువ వ్రాతలు. 48

సూర్యుడు క్రుంకిన పిదప
శుక్రుని ప్రక్క చంద్రుడు చేరాడు
జానెడు దూరములో కూర్చున్నారు
సన్నని వెన్నెలలో ఏమి గుసగుసలో !
శుక్రదుహిత దేవయానికి ముప్పేమీ లేదుగద !
గురుపత్ని తారనే అడగాలె ! 49

మందేగుండె నిచ్చావు
వేడి నిట్టూర్పుల నిచ్చావు
నీరు కారే కన్నుల నిచ్చావు
నెత్తురు కార్చేవాటిని ఇయ్యలేకపోతివే ! 50

విలాసినీ ! స్వాభిమానీ !
నీ అద్దములో చూచుకొనుచున్నావు చాలసేపుగ
ఆత్మస్తవములో పరవశము పొందుచున్నావు
ముసిముసి నవ్వులతో కేశముల సంస్కరించుచున్నావు

ఇక, నా అద్దములో చూడు కొంతసేపు
నీ వాస్తవము నీకు తెలుస్తుంది
ప్రాయపు అందాలు కొరబడినవని
కపోలములు కాంతి తగ్గి వాడినవని
తెలుసుకో! కొంత మేలుకాగలదు. 51

మా గుండెలలో తేనెతుట్లు ఉన్నాయి
అనుకూలిస్తే తేనెను చిందగలవు
ప్రతికూలిస్తే తేనెటీగలు విజృంభిస్తాయి
కరుస్తాయి రక్కుతాయి జాగ్రత్త! 52

అతని కలలు మండిపోయాయట
బూడిదలై పోయాయట!
ఆ బూడిదను సభలో పడవేశాడు
మూటలు కట్టమని అర్థమా!
గంగలో కలపమని అర్థమా! 53

కలలు బూడిదలైన
అతనికే విషాదాంత నాటకము
దేశానికి ఏమీ కాలేదు లే!
సమాజానికి ఏ ముప్పు వాటిల్లలేదులే: 54

నా కలలు కనకాన్నే పండించాయి
నాకూ ఆనందమే, నా స్నేహితులకు సంతోషమే
అందరము ఆనందపు బంతులలోనే ఆట్లాడుకొన్నాము: 55

మేధావులలో మేధావి విజ్ఞానులలో విజ్ఞాని
అని విర్రవీగాడు
దేశమరామత్తు కార్యము
తన భుజాలమీదే అని భ్రమిశాడు!

తలపై తనే కిరీటము తాల్చాడు
ప్రజలే పెట్టారని బూడిద కల కన్నాడు ! 56

ఇతరులు పచ్చగ ఉంటే ఈర్ష్య పడుతాడు.
ఇతరులపై నిందారోపణ చేస్తాడు
తనలోతాను సంతసించుకొనుచు.
విమర్శించుటే ఆయన వృత్తి
ప్రవృత్తి
అదే జీవన పరమావధి ! 57

జీవించు, జీవించనీ !
అనే ఉదారతత్వములో విశ్వాసము లేదు
తనకు అన్నీ కావాలె
ఇతరులు కోరినా తప్పే, జీవించినా తప్పే ! 58
జీవన సంపర్కము తక్కువ
తన నిర్ణయమే అందరి నిర్ణయము కావాలె.
సమాజాన్ని తిని బ్రతికాడు
ధర్మోపదేశాలు చేస్తూ మనినాడు ! 59

కొన్ని స్మరణలు పవిత్రమైనవి
మేల్కొలుపులు తొందరలు ఓర్వజాలవు
పదిలముగ విశ్రమింపనిచ్చుటే శ్రేయము 60

జ్యేష్ఠములో మద్రాసు ఎండ
కువిమర్శకుని ఈర్ష్యానలము వలె
వేడిగా ఉన్నది
తన్ను కాల్చుచున్నది, ఇతరులనూ ! 61

56 సంవత్సరాల ఉద్యోగి
పదవికి అనర్హుడని

60 సంవత్సరాలు నిండిన
ముఖ్యమంత్రి ఉత్తరవులు వేశాడు
ఎందుకీ వరదల బెడదలని
గోదావరి తుంగభద్రను అడిగింది ! 62

రమ్యమైన సంగీతము వింటూ
రసాత్మకమైన కవితల చదువుచున్నాను
కోరిన ఫలాహారాలు వచ్చి చేరాయి
ఓమర్ ఖయ్యాం జ్ఞప్తికి వచ్చాడు 63

హృదయ ఉద్వేగాలను
బిగ్గరగ మాట్లాడి నెట్టేస్తాను
నాకు ఏడుపు రాదు
ఏడ్చినా కన్నీరు రాదు
అంటుంది భానుమతి రామకృష్ణ 64

మనకు ఉన్నవి కొన్ని
లేనివి ఎన్నో !
లేవను దుఃఖాల గుడ్లమీద పొదిగేకన్న
ఉన్నవానితో సంతుష్టిపడి
శాంతంగా ఉండుట మేలు 65

దారిద్ర్యము అవిద్య
వెనుకబడినతనమును తలచుకొని
మనస్సును కఠినము క్రూరము
చేస్తారు కొంతమంది
సమాజాన్ని అక్కసుతో చూస్తారు
వారికి మనఃశాంతి ఎప్పుడో ! 66

ఆరోగ్యం ఎట్లా ఉందని అడిగింది
వయస్సుకు తగినట్లే అన్నాను

బాగా ఉన్నదనే గదా అర్థము అన్నది
ఆమె వ్యాఖ్యానానికి సంతసించాను 67

మరలా ఎప్పుడు వస్తారు మద్రాసు అని అడిగింది
వస్తే కలియండి అనే సూచన
వస్తే కలుస్తాను అన్నాను
తప్పకరండి అని ఆహ్వానించింది. 68

చాల అరుదు స్లీవ్‌లెస్‌వారు మద్రాసులో
కాఫీకి పిలిచి స్లీవ్‌లెస్ వేసింది
ఎండాకాలపు ఆహ్లాదాలలో
ఇదీ ఒకటని ఆనందించాను ! 69

మానవుడు శ్మశానశయన యాత్ర చేసేటప్పుడు
ఎన్ని పాపాలమూటల భుజాన వేసుకొని పోవాలనో !
పాపకళంక రహితుడు దైవాంశసంభూతుడే ! 70

వసంతము సంతసముతో ఎడారికి వచ్చింది
నవ్వే చెట్లు పాడే పక్షులు
స్వాగతం పలుకునని ఆశించింది
ఎడారి కనుబొమలు చిట్లించి అన్నది
వసంతమా, నీవెవరవో నాకు తెలియదు
నాకు తెలిసింది నీ చెల్లి గ్రీష్మమే ! 71

ఎడారీ ! శాశ్వతముగ ఎడారివి కావు నీవు
కళకళలాడే నగరముగా ఉండినావు
శాపము తగిలింది
మరలా చిగిర్చే తోటగనో
సిరులతో తూగే ఊరు కావాలని లేదా !
అని అడిగింది వసంతము

ఎడారి మిన్నకుండి నిట్టూర్చి
దుమ్ముల సుడిగుండాల రేపింది 72

ప్రేమ గులాబీ తీవలో
ఎన్ని మెత్తని రేకులున్నాయో
అన్ని మొరటు ముళ్లూ ఉన్నాయి
ఎన్ని కవ్వింపులో, అన్ని నిషేధాలు ! 73

ఉపన్యసింపవలసిన సభకు ఆలస్యంగ వచ్చింది
సంధ్యాకులాయమును మరచిన క్లాంత విహంగము వలె
తాళము తప్పిన నృత్యపాదము వలె చికాకుగ కాన్పించినది ! 74

వీడ్కోలు సమయాన
అందరి సమ్ముఖమున
ఆ కళాధురీణ నాకు
పాదాభివందనము చేస్తుంది
యోగిని కాను బాబాను కాను
శాస్త్రినికూడ కానే అంటే
మీరు పెద్దలండీ త్యాగధనులు
మీకు నమస్కరిస్తే మాకు శుభం అంటుంది
మరి నేనేమి చేయాలె ? 75

అరఘంట ఉపన్యసించడానికి ఒప్పుకొని వ్రాసికొని వచ్చింది
పెద్ద గొంతుతో పద్యాల రాగయుక్తముగ పాడింది
వేళైంది, ఉపన్యాసము సగమునకు రాలేదు
హరికథ మాదిరిగా ఉండినది శ్రోతలకు
పద్యము రమ్యముగ పాడినందులకు సంతసించింది
చెప్పవలసిన ముఖ్యాంశముల చెప్పనందులకు దుఃఖించింది ! 76

ఆమె మా అతిథిగా ఉండడానికి అంగీకరించింది
ఆమె సౌందర్యవతి, సంభాషణా చతుర
నా సంతసము వెల్లువై గట్టుల మీరింది
అట్టి సౌభాగ్యము అరుదుగ లభించేది గదా ! 77

ఆమె వసంతజ్యోత్స్నవలె వచ్చింది
పెక్కు విషయాలపై క్రొత్త వ్యాఖ్యల చేసింది
వెలుగులు ప్రోదిగ మాటల విందుగ
ఉండింది, ఉండిన నాలుగునాళ్లు
ఎంత పాండిత్యము, పరిశీలన, ఎంత అనుభవము ! 78

ఢిల్లీ సితారు వాద్యకారుని
రవీంద్రునికి పరిచయము చేశారు.
బాగా వాయిస్తారు సరే !
ఆపుటకుకూడా తెలియునా
అని బెంగాలీలో అడిగారు ! 79

గిటారు వాయించేవారు
120 సంవత్సరాలు బ్రతుకుతారు
అందు 80 సంవత్సరాలు
తంత్రుల మీటుకొంటు గడుపుతారు
అన్నాడు - ఆంగ్ల సంగీతజ్ఞుడు ! 80

మా ఊరు మంగలిమీద విశ్వాసము లేదు
తిరుపతి మంగలిమీదే విశ్వాసము
అన్నాడు జుట్టు బాగా ఎదిగిన ముసలాయన ! 81

అక్టోబరు 18 రాత్రి
ఝంఝ రుద్రపక్షముల విప్పి వచ్చింది
భైరవరాగము పాడింది

వడిగాలులచే నగారాలను సందడించింది
ప్రళయకాలపు ఫిరంగుల ప్రేల్చింది 82

కోట్ల చీకట్లు
నల్లని మ్రోకులతో
సూర్యుని తేరును
వెనుకకు లాగలేవు
లక్షల చలికాలాలు
ఆమని రాకను ఆపలేవు ! 83

నా పల్లవి
ఆమె చరణాలు
నా గేయము
ఆమె లాస్యము
నా సూత్రాలు
ఆమె భాష్యాలు
విజయ విజయీ సారథివలె
కృష్ణ సత్యభామల వలె
పరస్పర ఆశ్రితాలే ! 84

గగన విహారము చేసే
గరుత్మంతుడు కాదు
ఎలమావి గున్నపై పాడే కోకిలే !
ప్రబంధ విపుల వర్ణన కాదు
ముక్తసరి గజల్ శృంగారమే !
ప్రగాఢ పరిశీలన కాదు
సూక్ష్మ విహంగవీక్షణే జరిగింది
కొద్దిలోనే మహత్తును కాంచింది. 85

సౌందర్య గర్వముచే
ఇంత అవలక్ష్యమా!
అభిమాను లెవరైన నమస్కరిస్తే
కళ్లు త్రిప్పివేసి గమనించవే! 86

ఎవరది అంత పెద్ద ఉత్తరము వ్రాశారు
అని అడిగాడు వ్యాపారి
అవును, పనిమీద జాబులు
క్లుప్తముగ ఉంటాయి
పనిలేని జాబులు దీర్ఘముగ ఉంటాయి
అని నవ్వాను! 87

కాలమే ధనము
పని ఉన్నవారికి-
కాలక్షేపము కావాలె
పని లేనివారికి! 88

ఉద్యోగము పురుష లక్షణం
నిరుద్యోగము మహాపురుష
లక్షణం అంటాడు పఠాభి
సాహిత్యము నిరుద్యోగ విశ్రాంతి
లోనే పుట్టేది
సంగీతానికి కావాలె
బోలెడు నిరుద్యోగం! 89

నిరుద్యోగము అంటే
విశ్రాంతి - పదవీ విరమణ
56 సం॥ల తెలుగువాడిని
తొలగమంటాడు ముఖ్యమంత్రి

19వ శతాబ్దపు పాతదాన్నే
సముద్ధరిస్తానంటాడు 90

వర్తమాన స్థితులను రద్దుచేస్తూ
పాతది నెలకొల్పటమే
ప్రగతి అగుతుందా ?
ముందు లక్ష్యానికి
వెనుకటడుగులు
వేస్తే సరిపోతుందా ? 91

సభల్లో వ్రాతల్లో
విస్తారంగ ఉల్లేఖించేవారిని
చూస్తే జాలివేస్తుంది !
సొంత ధ్వని లేదా
సదా ప్రతిధ్వనులేనా వారు ! 92

క్వచిత్‌గా ఉల్లేఖిస్తే
నంజుడుగా ఉంటుంది
విస్తారముగ చేస్తూయుంటే
సద్ది అన్నముగా ఉంటుంది ! 93

శాస్త్రీయ సంగీతము వింటుంటే
ఆనందాశ్రువులు రాల్తాయి
సినిమా పాటలు వింటుంటే
నవ్వు వస్తూ ఉంటుంది ! 94

విశేష అర్హతలే
ఆమె వివాహాన్ని వాయిదా వేస్తున్నవి
ఐశ్వర్యము, వంశ మర్యాద
సౌందర్యము, పెద్ద చదువులు ! 95

జీవించాలని పెద్ద కోర్కె
చావు విషయము
ఎత్తడానికే భయపడుతాడు
భార్యాబిడ్డలు లేనివాడు
పెద్ద ఆస్తి కలవాడు
వీలునామా వ్రాయడానికి వెనుకాడుతాడు! 96

ముంతాజ్‌బేగం మరణము
తాజ్‌మహల్‌కు పునాది వేసింది
దుహితృవియోగము
దారాసంస్మరణ
పండిత లోకానికి దగ్గర చేర్చాయి
సంస్మరణల పేరుతో
ఆత్మీయుల మరణాన్ని
పండిత సన్మాన సభలుగ
మలచుకొన్నాడు. 97

అందరికీ అన్ని లక్షణాలు అబ్బవు
మొగలిపువ్వుకు పండులేదు
పనసపండుకు పువ్వులేదు
తమలపాకుకు పువ్వులేదు, పండులేదు
అంటుంది సంస్కృత శ్లోకము! 98

కోతికి మణి దొరికింది!
తాకి చూచింది, వాసన చూచింది
రుచి చూచింది, పనికి రాదని పారవేసింది
పగలగొట్టి చూడనందుకు సంతసించాము! 99

ఆమెతో దీర్ఘముగ సంభాషించాను
సాధారణ కంఠమనే తలచాను
వేదికమీద బహుశ్రావ్యంగ పాడింది
మాధుర్యము మాటల్లో ఎట్లా అణగిందా!
        పాటల్లో ఎట్లా చిమ్మిందా!
అని వితర్కించుకొన్నాను. 100

యౌవనములోని వితంతువుకు
కోకిల పాటలు దుర్భరముగ ఉంటాయి
విచిత్రమైన భావనలు
ఆమె హృదయములో మొలకలెత్తుతాయి
జీవితము ఏదో పోగొట్టుకొనినదని
హృదయము మరుభూమి యైనదని
ఏదో లేనటుల, ఏదో అప్రాప్తమైనట్టు తోచుతుంటుంది!
జరుగవలసినది జరుగనట్లు
ఎన్నటికి జరగపోదన్నట్లు తలచును
అమూల్య ఆభరణము పోయినట్లు
దొరికే అవకాశము లేనటుల
ఆనందాల పాత్ర చిల్లిపడిపోయినటుల
నైరాశ్యపు మూటల, జీవితపు ఎడారిలో
మోయవలసినటుల క్రుంగుచుండును
        ముద్దగట్టిన విషాదగీతిక!
        వ్రేళ్లు తెగిన వసంతలతిక! 101

ఆమె ఫిడేలు అద్భుతముగ వాయించింది
మనస్సు వ్రేళ్లతో రాగాలాపన చేసింది
మెదడులోని భావాన్ని వ్రేళ్లు తర్జుమా చేశాయి
శ్రుతి లయ తప్పకుండ వ్రేళ్లు
        ఎట్లా వాయించాయో అంత వేగంగ! 102

రాముని పాదస్పర్శచే
రాయి నాతిగ మారింది
ఈమె కరస్పర్శచే ఎన్ని రాగిణులు
మోహినీ రూపమున మేల్కొన్నవో !
ఎచ్చటనుండి ఆ సుందరాంగులు
పుట్టుక వచ్చారో !
ఏ రసహృదయుల అంకములో విశ్రమించారో ! 103

జవ్వని నేర్పుగ నాట్యము చేసింది
పదాలకు అతీతమైన
ముద్రల భాషలో మాట్లాడింది
పాదాల హస్తాల నేత్రాలతోనే భాషించింది !
సంగీతము నృత్యము నిజముగ
దేవవిద్యలనే తోచింది ! 104

మరణించి సంస్మరణము అయ్యింది
మృతి చెంది స్మృతి అయ్యింది
భూతకాల చితిపై చిందులు త్రొక్కేవే
బ్రతికినన్నాళ్ల జ్ఞాపకాలు ! 105

మనస్సు బాగుగ లేనపుడు
సంగీతము విన్నాను
ద్రుతముగ నడిచే పాటలు
జంత్రవాద్యాల ప్రతిస్పర్ధలు
మనస్సును గొలుసులతో పైకి ఎత్తినాయి
క్రిందికి పడనీయక ఎత్తినాయి. 106

సంతోష సమయాల్లో సంగీతము విన్నాను
కన్నులు మూసుకొనే ఆనందముగ విన్నాను

భూమినుండి కొంత పైకి పోయినటుల
అనుభూతి పొందాను
అన్నీ విస్మరించి, సంగీత సరస్సులో
తేలుచున్నటుల తోచింది ! 107

తిల్లానా వింటుంటే
చూచిన రమ్యనృత్యాలు
కళ్లల్లో మసలుతాయి
అప్రయత్నముగ కంఠము భుజాలు
హస్తాలు లయకు అనుగుణ్యముగ
సంచలితము లగుతాయి
ఎవరూ చూడకుంటే అడుగులు కూడా
లయ వేయ యత్నిస్తాయి ! 108

ద్రుతలయ భరితమైన సంగీతము
రణవీరులకేకాదు ఉత్సాహాన్నిచ్చేది
జడబుద్ధుల కూడ ఊపకలిగేది
మనస్సు హృదయములను మాత్రమేగాక
దేహముల సహితము ఊపింపగలిగేది. 109

55 సం॥ పూర్తికాగా పదవీ విరమణ
ఎప్పుడు నిర్ణయించారో 19 వ శతాబ్దములో !
ఆ నిర్ణయానికి ఎంత దీర్ఘాయుస్సు,
ఆయుస్సు ఆరోగ్యము పరిస్థితులు మెరుగుదలను
లెక్క చేయనని విముఖత చూపింది ! 110

గాలి చీకాకు పడ్డప్పుడు
తుపాను అగుతుంది
సముద్రము చీకాకు పడ్డప్పుడు
ఉప్పెన అగుతుంది

ఆకాశము చీకాకు పడ్డప్పుడు
ఉరుములు పిడుగులతో కనబడుతుంది
భూమి చీకాకు పడ్డప్పుడు
భూకంపమగుతుంది
మనిషి చీకాకు పడ్డప్పుడు
కోపపడుతాడు తలపులతో కొట్టుకపోతాడు. 111

ప్రేమ మహావృక్షము క్రింద
భిన్న వర్ణచ్ఛాయలు కలిసిమెలసి ఉంటాయి
అనురాగము భక్తి మైత్రి
వాత్సల్యము అభిమానము
క్రీడలు సల్పుతాయి. 112

సహజ పరిస్థితులలో
ప్రేమ శృంగారముగ పరిణతి చెందవచ్చు
ప్రేమకు ఎల్లలు లేవు
శృంగారానికి చుట్టూ ఎల్లలే! 113

శృంగారానికి కావాలె
ఏకాంతము మరుగు చీకట్లు
పరనయనముల ఏమార్చాలె
సొంత ఉల్లాసమును ఆహ్లాదమును
సృష్టించుకోవాలె! 114

ప్రేమ నిరంతరము స్వచ్ఛంగ పారుతుంది
శృంగారము తాత్కాలికముగ
ఎగుడు దిగుడులతో దూకుతుంది
ప్రేమకు వయస్సుతో నిమిత్తము లేదు
శృంగారము యౌవనాన్ని పెనవేసుకొని ఉంటుంది

శృంగారము బాల్యములో
వార్ధక్యములో కాన్పించదు. 115
శృంగారపు పునాదుల మీద
సృష్టి జరుగుతుంది
భవిష్యత్తుకు కావాలె సంతానము
సంతానము జనించడానికి
కావాలె శృంగారము
శృంగారానికి కావాలె ప్రకృతి పురుషులు. 116

శృంగారము కాంక్షిస్తుంది
రహస్యము నేపథ్యము
గోప్యముగా జరగాలె
శృంగార లీలలు
పవిత్రమైన సృష్టికార్యానికి
రహస్య క్రీడలు
జన్మేంద్రియాలకు కావాలె
ఆచ్ఛాదనలు. 117

అన్ని కార్యరంగాలు బహిరంగమే
సృష్టి కార్యరంగము నేపథ్యములోనే !
ఏమిటో ఈ వైపరీత్యము
ఎందుకో ఈ కనుమరుగులు ! 118

శృంగారము రసరాజము
సంభోగము రసాభాస !
సంభోగవర్ణన జుగుప్సాకరము
నీతివిదూరము ఔచిత్య భంగము. 119

సంతోషపడని భూసురుడు
చెడిపోతాడు

సంతోషపడే భూవిభుడు
చెడిపోతాడు
సిగ్గుపడని ఇల్లాలు
చెడిపోతుంది
సిగ్గుపడే వెలయాలు
చెడిపోతుంది
అని ఆర్యోక్తి! 120

వ్యవసాయోత్పత్తి, వినియోగము
హద్దులలో ఉంటుంది
పారిశ్రామికోత్పత్తి వినియోగము
హద్దులలో ఉండదు
అన్నానికి కూరలకు పండ్లకు
పరిమితి ఉంది
ఎక్కువ తింటే రోగము వస్తుంది
గడియారాలకు రేడియోలకు కార్లకు
పరిమితి లేదు
రోగము లేకుండ ఎన్నైనా వాడవచ్చు! 121

జ్యోతిష్యులు చెప్పినమాట నిజమైనది
పురుష సంతానము కలుగునని చెప్పారు
కుటుంబ మర్యాదకు
వంశప్రతిష్ఠకు ఉపయుక్తమగు
కుమారుడు కాడు
పరకళత్రము వలన కాబట్టి! 122

ఆ అమ్మాయిని అప్పుడప్పుడు
వచ్చి చూస్తూ ఉండడము
పుట్టిన రోజుకు మంచి కానుకలు
ఇవ్వడం పరిపాటి

ఆమె నిజజనకుడు తనే అని
విశ్వాసము
పితృప్రేమ అతనిని పరిపరి విధముల
త్రిప్పుచుండినది !
చట్టము ఒప్పుకపోయినా
హృదయము ఒప్పింది ! 123

మేనక అవివాహిత - సురవేశ్య -
ఆమె కుమార్తె శకుంతల
శకుంతల కుమారుడు భరతుడు
ఆ భరతుని పేరుమీద
మన దేశము భారత వర్షమైందట
వంశవృక్షము గొప్పగలేదే ! 124

వార్ధక్యము కండరాలను తినేస్తుంది
వెంట్రుకలను నులుమివేస్తుంది!
బాల్యము యౌవనము
దేహసంగీతానికి ఆరోహణలు ! 125

రాయలసీమలో
రెడ్లు చాల మంది ఉన్నారు!
తెలంగాణాలోను పెక్కుమంది ఉన్నారు
నెల్లూరులోను అంతే !
అంతేకాదు, అండమానుల్లో కూడా
మా వాళ్లు చాల మంది !
అనేవాడు సి. ఆర్. రెడ్డి 126

తగాదాలు పడ్డప్పుడు
కమ్మవారు సివిల్ లాయర్ వద్దకు వెళ్లతారు

రెడ్లు క్రిమినల్ లాయరును సలహా పడుతారు
ఒకరికి వ్యాజ్యము కావాలె
ఒకరికి తోడనే ఫైసలా కావాలె ! 127

తమిళ కన్నడ ఉర్దూ ప్రభావాలు
రెడ్లమీద ఎక్కువ
ఏ భాషాప్రభావము లేకుండా
అచ్చమైన తెలుగువారు కమ్మవారు
తెలుగునాడు నడిబొడ్డున
ఉన్నవారు కమ్మవారు
అంచుల్లో ఉండి పరసీమల మీద
కన్ను వేస్తారు రెడ్లు ! 128

కమ్మవారిని ఎదుటనే తిట్టేవాడు
బెజవాడ కట్టమంచి కొళందరెడ్డి
తిట్టి తిట్టి వారు వెలవెలపోతుంటే
మా రెడ్డి నాయాళ్లు
ఇంకా ముదనష్టము !
అనేవాడు బిగ్గరగ నవ్వుచు
అందరు బృందహాస్యము చేసేవారు
ఎవరికీ మనస్తాపము ఉండేదికాదు
కొళందరెడ్డి ఎన్నికలలో కమ్మవారే
బాగా సహాయపడేవారు
తిట్టి ఆకర్షించే శక్తి ఆయనిది !
పొగడి ఆకట్టుకొనే శక్తి చాల మందిది ! 129

ఎక్కువగ కమ్మవారు సాగరేయులు
తెలగవారు సాగరతీరపువారు

రెడ్లు పార్వతేయులు
నెల్లూరువారు సాగరేయులు
సాగరతీరేయులు
పార్వతేయులు ! 130

నెల్లూరు సర్కారు జిల్లాల్లో చేరదు
రాయలసీమలో చేరదు
త్రిశంకు స్వర్గంలో ఉంటుంది !
గబ్బిళమువలె ఉంటుంది
సర్కారు వారిచే ఉపేక్షితులు
రాయల వారిచే తిరస్కృతులు ! 131

తెలుగువారు దానపరులైతే
నెల్లూరువారు నిదానపరులు
వెనుకచూపు అధికము
ముందడుగు తక్కువ
ఆంధ్ర రాష్ట్రముతోడనే రావాలె
నెల్లూరును మినహాయిస్తూ
అనేవాడు వంగల్లు కోదండరామరెడ్డి ! 132

సత్యాగ్రహ దినాల
వీరోచిత త్యాగాల చూచి
కమ్మవారిమీద క్షత్రియులమీద
అభిమానము పెంచుకొన్నాను
జైళ్లలోను వారితో
స్నేహము బంధించింది
ఆనాటి అభిమానము
ఇప్పటికి పెరుగుచున్నది

ఈనాడు కష్టపడుతారు
సంపాదిస్తారు, ఖర్చు పెడుతారు
విదేశాలకు వెళ్లుతారు
అన్ని ఉద్యమాలలోను అగ్రగాములు కమ్మవారు. 133

మబ్బుల చాందినీ క్రింద
రైలులో ఢిల్లీ ప్రయాణము!
అప్పుడప్పుడు ప్రకృతి లేతనవ్వుల నవ్వేది
ఎన్ని వందల మడుగుల నీళ్లల్లో
మబ్బులు ప్రతిరూపుల చూచుకొన్నాయో!
భూమాత పచ్చగ చల్లగ
సంతసాన్ని ప్రకటిస్తు
పిల్లగాలుల పంపుచున్నది. 134

భయపడుచు కవి
కళాప్రపూర్ణ వేదమువారికి
పుస్తకాన్ని యిచ్చాడు.
శాస్త్రిగారు చదువుచుండ
తప్పుల చూస్తున్నారా! అని అడిగాడు
కాదు ఒప్పులనే! అన్నారు శాస్త్రిగారు
కవి బెదరిపోయి
సెలవండీ అని లేచారు! 135

1935 సం॥లో ఆనాటి గంజాం జిల్లాలో తిరుగుచు
శ్రీ గిడుగు రామమూర్తిని దర్శించాను
శాంతినికేతన్ విద్యార్థిని
గోపాలరెడ్డి అనబడే వాడిని అనగానే
5, 6 సంవత్సరాల పూర్వము

త్రివేణిలో 'గాంధిజి - గు
జరాతి సాహిత్య సేవ' అనే వ్యాసాన్ని
వ్రాసింది నీవేనా అని అడిగారు
ఆనందముకన్న ఆశ్చర్యం కలిగింది నాకు
ఎంత ధారణాశక్తి !
ఒక అనామిక యువకుని వ్రాత ! 136

నేను మంత్రిని కాకమునుపు
పెద్దలను వారి స్వగృహములలో దర్శించాను
రవీంద్రుని ఉత్తరాయణములో -
గాంధిజీని సబర్మతీ ఆశ్రమములో (చూచాను)
కాశీ కృష్ణాచార్యులను గుంటూరులో
చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలను కడియములో
వేంకట్రాయశాస్త్రిలను నెల్లూరులో
కృష్ణశాస్త్రిని పిఠాపురములో
దువ్వూరి రామిరెడ్డిని పెమ్మారెడ్డిపాళెంలో
రామస్వామి చౌదరిని తెనాలి సూతాశ్రమములో
నా జీవితములో పెద్ద భాగ్యమని తలచాను. 137

రైలులో ఎదురుచూచి
బ్రతిమాలి తెప్పించుకొన్నాను పత్రిక.
చదివాను, ప్రక్కన పెట్టాను
ఫలహారము తిని, చేయి తుడుచుకొన్నాను
భోజనము పళ్లెం క్రింద పరుచుకొని పారేశాను.
ఎంతో ఆసక్తి వైభవము చూపిన పత్రిక
మన్నులో కలిసింది

అంతే దాని ఆయువు !
ఇంతలోనే మతాబు వెలుగుల క్రుమ్మరించింది ! 138

నా జైలు నివాసములు
ఎంత ఉపకరించాయి !
ఎంతమంది నాయకుల దర్శనము !
ప్రతిభావంతులతో సంభాషణ
స్నేహితులతో సహవాసము
ఎన్ని క్లాసులు, ఎంత చదవడాలు
జీవితములో పెద్ద అదృష్టము
పెద్ద మలుపు, పెద్ద నిచ్చెన
త్యాగానికి త్యాగము
ఉపయోగానికి ఉపయోగము. 139

కురిసి దస్సి వెలిసి
మరలా కురుస్తున్నది వాన !
ఆదిలాబాదు అడవులు
క్రొత్త కాంతితో మినమినలాడుచున్నవి
చెట్లు నీటిచుక్కల రాలుస్తున్నవి
ఆనందాశ్రువులా
ముత్యాల అక్షతలా !
అడవివాగు చకచక నడుస్తున్నది
కొద్ది నురుగులతో, చిన్న అలలతో
వృక్ష ప్రకాండముల అడుగుల
తలతో తాకుచు వెడలుచున్నది
ఆనంద రసము చిందుచు పోవుచున్నది
ఆహ్లాదము కలిగించే దృశ్యము
కడు రమ్యమైనది. 140

దట్టమైన పొగమంచు మాదిరి
చుట్టుకొన్నది వానతువ్వల తెర అడివిని

అర్ధస్ఫుటముగ అర్ధనగ్నముగ ఉన్నది దృశ్యము
వనదేవతల జలక్రీడలకు వేశైనదా ? 141

పర్వతములు ధ్యానగంభీరములై
ఎన్ని సహస్రాబ్దములుగ నిలిచియున్నవో !
ఎంత ఇతిహాసము, ఎన్ని సంస్కృతీ పరివర్తనములు
వీనిని రాసుకుంటూ చనినవో !
ఎన్ని రాజ్యోదయాలు, అస్తమానాలు
కాలిజాడల కూడా వదలక చనినవో !
కాలవైభవ మహిమల దాచిన
పాషాణ భోషాణాలో ! 142

పర్వతములు పాషాణ హృదయములా !
రసవిహీనములా !
వానాకాలము ఎంత మనోహరముగా కాన్పించుచున్నది !
పచ్చని గడ్డి ఉత్తరీయముతో
వృక్ష తండముతో
ప్రక్కన పారే వాగుల జపమాలతో
ప్రయాణమునకు సిద్ధమైన
మునీశ్వరునివలె ఉన్నవే ! 143

పర్వతములు అరణ్యములు
నదీతీరాలు భిన్నప్రవృత్తుల వారిని
ఆకర్షించాయి
యోగులు, రాజులు పండితులు వణిజులు
అనువగు వసతుల కల్పించుకొన్నారు
ఆశ్రమాలు, గురుకులాలు
దుర్గాలు కార్ఖానాలు అచ్చటనే ప్రవర్ధిల్లినాయి. 144

దిగంతాల పటము మీద
ఎంత విచిత్రమైన చిత్రము ఇంద్రధనుస్సు !
అలౌకిక చిత్రకారుని కళాదక్షత
ఎన్ని గీతలు ఎన్ని వంపులు
ఎన్ని వన్నెల కలయికలు !
కళానైపుణ్య పరాకాష్ఠగ తోచింది
సాయం సమయపు హరివిల్లు ! 145

నీతి సమాజము
నిషేధిస్తున్నవి అశాస్త్రీయ చుంబనము
ప్రవృత్తి, అభిలాష, కోరుచున్నవి చుంబనము
నీతి - ప్రవృత్తి సదా కురుక్షేత్రము సలుపుచున్నవి
అవకాశము లేకున్న నీతి గెలుస్తుంది
అవకాశము చిక్కిన ప్రవృత్తిదే పైచేయి ! 146

నిషేధమని తెలిసే ఎందుకు
కోరుతుంది ప్రవృత్తి !
నీతిశాస్త్రము ధర్మశాస్త్రము
చట్టము సంఘము వద్దని
ఘోషిస్తున్నాయి,
అవన్నీ నాకు తెలియనివా !
తెలిసే కోరుచున్నాను వద్దన్నవానిని
నన్ను మించిన కోరిక లాగుచున్నది
నిషిద్ధ ఫలమువైపు !
అయస్కాంత శక్తి కలవానిని
నిషేధాల చట్టాల బ్రేకులు ఆపలేవు !
సంఘర్షణ ఆదినుండి వస్తున్నదే !
పరిపాటియైనది, శక్తి శిథిలమగుచున్నది. 147

పార్కు చక్కగ అలంకరించుకొని
అరణ్యము వద్దకు కులుకుచు వచ్చి
విలాసముగ అడిగింది
"చూడు, నా అలంకారములు
నా శిరోజాల కత్తిరింపులు
సవరింపులు తీగల కుచ్చెళ్ల
నీకేమీ లేవే!"
నాకెందుకు కత్తిరింపులు?
ఆకాశానికి చేతులు చాపేదాన్ని!
స్వేచ్ఛగ మనేదాన్ని!
చూడు, ఎన్ని జింకలు, పక్షులు
నావద్దకు వస్తాయో! నేను నీడలనిస్తాను
నీవు కంటికి మాత్రమే ఇంపు
నేను ఒంటికంతా సొంపు, హాయి
నీవద్దకు వచ్చినవారు
ఎక్కడ కూర్చుంటారు అన్నది జాలిగా! 148

పార్కుకు నాజూకుతనము
ఎక్కువ, అలంకారాలు ఎక్కువ
ఉపయోగము తక్కువ
అలసట తీర్చుకోడానికి నీడలు లేవు
వినడానికి పిట్టల పాటలు లేవు
వ్యయము ఎక్కువ, ఫలితము తక్కువ! 149

వృత్తాలకు విలువలు లేవు
లయగ్రాహి కవిరాజ విరాజితము
నేటి కావ్యాలనుండి ఎగిరిపోయాయి!
ద్విపదలకు ఆటవెలదులకు

వ్రాకింది సాహిత్యము
వచనములోనికి ఎదిగింది
కవితా భాషకు స్వేచ్ఛను నేర్పింది
కార్యతత్పరులకు కావాలె వచనము
ఆధునికతకు కావాలె వచనము
చైతన్యస్ఫూర్తివంతులకు కావాలె వచనము
వచనమే నేటి ప్రగతికి సోపానము
సాహిత్యానికి ప్రాణము. 150

రవీంద్ర వర్ధంతి దినము
ఢిల్లీ గాంధి స్మృతి దర్శించాను
ఎన్నెన్ని వీరసంఘటనలు
నా జీవితములో జరిగాయి
ఎన్ని పూర్వ చరిత్రకు తెలియని త్యాగాలు!
ఎన్ని ఉత్సాహప్రద ప్రసంగాలు!
ఆ సంఘటనల జ్ఞాపకాల ఊరేగింపులు
మనస్సును ఉత్తేజపరిచాయి. 151

రవీంద్రనాథ్, గాంధి
భారతదేశమును అలంకరించిన
మానవ మేరు శిఖరాలు
ఏ దేశమైన ఏ శతాబ్దమైన గర్వింపదగిన
జనప్రియులైన మేధావులు
కళాదేవతల అనుంగు పట్టి ఒకరైతే
సత్యాగ్రహమను అహింసాస్త్రము నొసగిన
శాంతిసేనాపతి యొకరైనారు
వారి కాంతి కరదీపికలు బాటను
సుగమ్యము చేశాయి. 152

గార్హస్థ్య జీవిత రహస్య పేటికను
నా ఎదుట తెరచారు
అది మౌనపు ముసుగును వేసికొని
మూలనుండేదే !
ఎన్నో చీకాకు పరచే చిన్న విషయాల
తునకలు కన్పించాయి
సకాలములో భర్తతో చెప్పని విషయాలు
తండ్రితో చెప్పని విషయాలు
సంప్రతింపుల లోపాల ఫలితాలని
నిర్ణయించుకొన్నాను. 153

కళకళలాడే కుటుంబానికి పీడకలలా !
హృదయతంత్రుల సడలింపులా !
తెరముందు ముద్దులాటలా !
తెరవెనుక గుద్దులాటలా ! 154

చీకటి వెనుక అరుణోదయానికి
సంతోషిస్తాము
వెలుగు క్రింద చీకటికి
దుఃఖిస్తాము
అమావాస్య కిటికీగుండ
తొంగిచూచే బాలచంద్రుని కీర్తిస్తాము
కరువు దినాల అభ్రపతాకానికి
నమస్కరిస్తాము ! 155

వెలుగునీడల దాంపత్య పరిరంభణ
మీర లేదా మానవ జీవితము !
వరదల సుడిగుండాల కన్నులను
ఏమార్చలేదా మానవ జీవితము !

మానవుడుగా పుట్టడం
కష్టాలు పడడం
ఒకే నాణెపు వేరు ముఖాలన్నాడు గాలిబ్
మానవుడు నిత్య యాత్రికుడు
నిత్యానందాన్ని పొందుతాడు
అన్నాడు అరవింద యోగి. 156

నిరంతర యాత్రలో
తొలి మజిలీ చేరాడు మానవుడు
ఇంకా ఎన్ని మజిలీలో, ఎన్ని అనుభవ వికాసాలో
ఎన్ని సహస్రాబ్దాలు గడవాలో
ఎప్పటికో ఆ నిత్యానందం!
ఆ నిత్యానంద జ్యోత్స్నా యామినిని
భావిస్తేనే ఆనందమగుతుంది నేడు! 157

ఢిల్లీ ఆగస్టు ఎండల వత్తులు
చురుకుగా వెలిగాయి
నీ ఆరోగ్యపు వత్తులు
మందముగా వెలిగాయి
మిత్ర సమావేశపు వత్తులు
వెలుగనే లేదు
ఆశించిన ఉత్సాహాన్ని పొందలేదు
నా ఢిల్లీ యాత్ర. 158

జరిగే దినాల ముఖాలు
అందంగా లేవని అంటుంది జాతకము
అదే నేను గమనిస్తున్నాను
చప్పిడి ముక్కులు, జారిన చెక్కిళ్లు

జాతకాన్ని ఎందుకు చూస్తావు
అంటుంది మెదడు
వారసత్వపు విజ్ఞానాన్ని
వదలలేము అంటుంది డెందము ! 159

ఆమె వేరుపడ్డ భార్య
వెడలుచున్నది విలాసంగ
విరుల కబరితో !
ఆమె ఆనందాల మంజరి కాదు
బుసగొట్టుచున్నవి పెక్కువగల పాములు
డెందపు పుట్టలో దాచింది
రేయి చీకట్లలో చేదు విషాలనీరు కార్చింది ! 160

పగలు నవ్వులు
రాత్రి కన్నీరు,
అదొక జీవితం !
రాత్రి సంతోషపు పాటలు
పగలు విసుగును పుట్టించే పనిపాటలు
ఇదొక జీవితం !
కప్పు పెంకుల క్రింద
గోడల ఇటికెల మధ్య
ఎన్ని రకాల జీవితపు గుసగుసలో ! 161

ఢిల్లీ మేడలలోని ఫ్లాట్సు
ఒకే రకంగా ఉన్నాయి
మార్పులేని అగ్గిపెట్టెలవలె ఉన్నాయి
లోపల జరిగే సంఘటనలు వేరు వేరు
వివిధ రూపాల సమస్యలు, బాధ్యతలు
ఆందోళనలు, ఆనందాలు ! 162

రోగాల మార్గాలు వేరైనా
ధ్యేయం మరణమే !
మత విశ్వాసాలు వేరైనా
ధ్యేయం మానవత !
పార్టీల నినాదాలు వేరైనా
ధ్యేయం ప్రజాసేవ !
అవయవాలు వేరైనా
ధ్యేయం శరీరమే !
రంగులు వేరైనా
ధ్యేయం పతాకమే !
వేర్పుల అన్నిటి మధ్య
ఒకటిని కనుగొనుటే ఐక్యత. 163

శాంతి సమయాల్లో
ఐక్యతనే ఉపాసిస్తాము
దానినే ప్రచారము చేస్తాము
ఉద్రేక సమయాల్లో
ప్రథమ బలి ఐక్యతే !
ఎట్లా ఆవిరౌతుందో ఐక్యత !
ఎచటికి పలాయిస్తుందో ఐక్యత !
మెదడు ఎన్ని మార్పుల చెందుతుందో !
క్షణములో మానవుడు
దానవు డగుతాడు ! 164

ఢిల్లీలో అంతా కోట్లమీదే వ్యవహారము
వేషాలలో కోట్లు లెక్కలలో కోట్లు
ప్లానింగ్ కమిషన్‌లో కోట్లు
క్రీడారంగములో ఖర్చు కోట్లు

గాంధిజీ ఉంటే ఏమి చేశేవాడో !
చిన్న ధోవతినీ మాని, కౌపీనము
కట్టేవాడేమో ! 165

దశాబ్దాలలో దేశం ఎంత మారింది !
ఆదాయాలు వ్యయాలు అంచనాలు
మారాయి గుర్తు తెలియనంత
వచ్చే శతాబ్దాలలో తెలుస్తుందా !
ఏదో జన్మలో తిరిగివస్తే
పోల్చుకోగలమా
ఈనాటి పరిసరాలు ! 166

నేను బడికి వెళ్లే దినాలలో
దేశ జనాభా ముప్పదికోట్లు
బర్మా బంగ్లాదేశ్ పాకిస్తానులతోసహా
నా కుమారుడు బడికివెళ్లే కాలములో
జనాభా నలుబదియైదు కోట్లు
నా మనుమడు బడికివెళ్లే కాలములో
జనాభా అరువది కోట్లు
భూసహనానికి అంతము లేదా ? 167

గడచిన కాలాల గుంటల త్రవ్వేవారికి
ఎముకలు దొరికాయి
అవి ఎవరివో బక్కచిక్కిన కూలివానివో !
ఆడంబరముల అనుభవించిన శ్రీమంతునివో !
మూగ భూతకాలము,
ఎముకల ద్వార నాణెముల ద్వార
మట్టిబొమ్మల ద్వార మాట్లాడుతుంది ! 168

నిపుణ రచయిత మెచ్చించిన సీరాబొట్టు
ఎంత మందిని ఎంత కాలము
ప్రభావితము చేస్తుందో!
వీరసైనికుడు కార్చిన నెత్తురుబొట్టు
ఎంత మందిని కాపాడుతుందో!
ఎన్ని విజయములకు పునాది వేస్తుందో! 169

ఇప్పుడు కురిసిన వాన
నా జిల్లాకు అధమము 30 లక్షల
లాభము చేకూరుస్తుందని అన్నాడు
జిల్లా కలెక్టరు తిరుచిరాపల్లిలో
వానజల్లుల విలువ ఎంతో
నాకు ఆశ్చర్యం వేసింది
అందుకే కనకవర్షమన్నారు పెద్దలు
చిన్న విషయాల పెద్ద విలువలు! 170

తిండికొరకు అటునిటు తిరిగే
మానవులు పశువులు పక్షులు
కీటకాలు నూరు సంవత్సరాలకే
మరణ అంకములో శయనిస్తాయి
కదలికలేని వృక్షాలు
వందలయేడులు జీవిస్తుంటాయి
అట్టటచ్చట వేలయేండ్లు కూడా,
కదలికకూ ఆయుఃపరిమితికి
ఏనాటి చుట్టరికమో! 171

ఢిల్లీ తిరుగుమార్గములో వేకువనే
దిగంతశైల మాలలు

అరమోడ్పు కన్నులతో
స్వాగతం చెప్పుతాయి.
వింధ్యాచలాలు ఆమోదతూర్యాలు వినిపిస్తాయి.
పశ్చిమ దిశవైపు ఆసక్తి చూపిన
నర్మద కిలకిల నవ్వుచు ఆహ్వానిస్తుంది
సత్‌పురా పర్వతశ్రేణులు
శైలసురంగాలు వనసాల వృక్షాలు
ఎదురుతెన్నుల కాస్తాయి
క్రింద పచ్చని తివాచి
పైన మబ్బుల చాందినీ !
ఆహ్లాదమును రెట్టింపు చేశాయి
ప్రయాణములో ! 172

పచ్చగ పెరిగిన పొలము
చుట్టు ముళ్లకంచె
ఎద్దు ఇటునటు చూచి
కొమ్ములతో కంచెను పెకలించి నెట్టేశింది
తుష్టిగ మేసింది
వీరభోజ్యము గదా రాజ్యము !
ఇది వృషభ విప్లవమే
నిషేధ కంటకాల విచ్ఛేదము ! 173

సాగరుడు పల్లపు మాగాణములలో
నిరీక్షిస్తుంటాడు
కొండపిల్లల ఆకర్షిస్తు
సులభమార్గాన్ని అనుసరిస్తూ
హాసఫేనాలతో ముగ్ధనదీ రమణులు
గంతు లేస్తుపోతారు

సాగరుని చేతిలో చిక్కుతారు
తీరని మోహముతో అగాధ అంతఃపురాల
ప్రవేశపెట్టి దాచేస్తాడు
కొండపిల్లల ఆఛోకీ తర్వాత తెలియరాదు ! 174

పర్వతాలతో మబ్బులు
దాగుడుమూతలు ఆడుతాయి
వనాలతో ఎండలు
దాగుడుమూతలు ఆడుతాయి
చెట్టుకొమ్మలతో పౌర్ణమి చంద్రికలు
ఆటలాడుతాయి
రోహిణీపతి తారకలతో
గొబ్బిళ్లు ఆడుతాడు
క్రీడాసక్త ప్రకృతి
లీలా కుతూహల ప్రకృతి ! 175

అద్దాన్ని చూస్తే శిరోజాలస్థితి
జ్ఞాపకానికి వస్తుంది
అమృతాంజనాన్ని చూస్తే
మరచిన జలుబు జ్ఞప్తికి వస్తుంది
టెలిఫోనును చూస్తే
ఎవరో ఒకరు జ్ఞప్తికి వస్తారు
కారును చూస్తే స్నేహితుడో
బజారో జ్ఞప్తికి వస్తారు
కల్పించుకొన్న అవసరాలు
దొరికిన అవకాశాన్ని వినియోగించాలె ! 176

వాన గిలిగింతలకు
ఏరు గగుర్పాటు చెందింది

ఎలప్రాయపు పొంగుల
విలాసాల చూపింది
గట్టుల చెట్లతో
సరసాలాడింది
చిన్న అలలతో కనుసైగల చేసింది
నవ్వు నురుగులతో
కూనురాగాలు తీసింది ! 177

చెట్లకు చైత్రము రావాలె
నదులకు శ్రావణం రావాలె
వర్తకులకు దీపావళి రావాలె
సేద్యగాళ్లకు సంక్రాంతి రావాలె
పెండిండ్లకు సెలవులు రావాలె ! 178

చందమామను పట్టడానికి
చెట్లు తయారయ్యాయి
కొమ్మల చాపిచాపి యత్నించాయి
ఊపి ఊపి ఎగసి ఎగసి యత్నించాయి
చందమామ చిక్కక నవ్వుచు నిలబడ్డాడు
ఇంతలో మబ్బు దాసి వచ్చి
చంద్రకిశోరాన్ని ఎత్తుకపోయింది !
ఎన్ని ఆటల ఆడుతుంది ఆకాశము ! 179

హిమాద్రి శిఖర శిరాలపై
కాలిడినాడు మానవుడు
జండా నాటినాడు విజయచిహ్నంగా
'మానవుడా ! నా లోతులు
నీకు సాధ్యమా' అని అడిగింది
ప్రశాంత మహాసాగరము. 180

మన అవసర వస్తువులు
అనవసర వస్తువులు అన్నీ
భూమినుండి పుట్టినవే !
ఆహారాలు, ఇంటి సామాన్లు,
బట్టలు, మందులు, కాగితాలు
యంత్రాలు
ముడిపదార్థము భూమిదే
తీర్చిదిద్దింది మనిషి చేతులు మెదడు. 181

ఏరు క్రొత్తగ వచ్చినప్పుడు
కోకోరంగులో ఉంటుంది
క్రమేణ కాఫీ రంగులోనికి
టీ రంగులోనికి మారుతుంది
పాలరంగు ఎన్నడూ కాదేమో
అన్నిటికీ రంగులంటే ఇష్టమే !
ఇంద్రధనుస్సుకే కాదు
ఊసరవెల్లికే కాదు
తోట పువ్వులకే కాదు ! 182

అగ్నికి నవనీతము వలె
ప్రేమకు ప్రేమ కరుగుతుంది !
యౌవనానికి యౌవనము
మారు పలుకుతుంది !
లొంగిపోతుంది !
అంకుశానికి కొరడాకు లొంగేయి కొన్ని
చిరునవ్వుకు లొంగేయి చాలా !
వేణునాదానికి లొంగేది నాగుబాము
మంచి మాటకు లొంగేది కొండలోయలు
ప్రతిధ్వనిస్తుంది ఏడుకొండలలో. 183

ఈ ఐదేళ్ల ఉంటాడు గదా
రామారావు అని అడిగింది
ఉండకేమి, ఈలోపల విసుగుతో
వదలెయ్యకపోతే,
మరొక ఐదేళ్లూ ఉంటాడు
లోక మరామత్తు పని అంతా
ఒక ఏడులో పూర్తికావాలనుకోక పోతే! 184

స్వచ్ఛమైన సంధ్యాకాశములో
పొగగొట్టాలు నల్లపొగ స్తంభా
లను ఎగజిమ్ముచున్నవి
ఆకాశానికి ఏ నల్లసందేశాన్ని
పంపుచున్నవో!
మాలిన్యాన్ని వదిలేస్తున్నాము
ముందు అంతా నిర్మాలిన్యమని
బాకాలు ఊదుచున్నాయా!
రాజకీయ నాయకుల నినాదాలా! 185

మేఘాల ఛేదించుకొని
దూర క్షితిజాల నుండి
కొంగలు మరలుచున్నవి
సంధ్యాకులాయములకు
ఎంత క్రమశిక్షణతో చనుచున్నవి!
వియత్ వాహినియా!
శాంతిదూతల సముదాయమా!
విహంగ రూపిణులగు గంధర్వులా!
ఎంత మనోహర దృశ్యము! 186

ఏనుగులు నడవలేని
మేకలు ఎక్కలేని
శైలశృంగాలకు ప్రాకాయి తీగలు
పువ్వుల ప్రసవించాయి
విజయ కేతువుని నాటాయి
స్వల్పుల స్థానమెంతో చూపాయి ! 187

మృత్యు మందిరములో
ప్రమోగిస్తున్నాయి ఆరతిగంటల రోగాలు !
ఐహిక ఆవేశములలో
కోరిక సందడులలో
వినలేకున్నాము
క్రమేణ వినబడుతాయి
కడకు మౌనసాగరములో
విలీనమగుతాయి. 188

రోగాన్ని నిర్లక్ష్యము చేశాము
దీర్ఘకాలము బాధపడ్డాము
ముదిరింది, మేల్కొన్నాము
గాభరా పడ్డాము
పెద్దయత్నముతో, విశేష వ్యయముతో
దాని విసురును తగ్గించాము. 189

ఉత్సాహముగ పత్రికలో వచ్చిన కవితను
పఠించమని కోరాను
ఉదాసీనముగ ఎన్నడో విన్న
జ్ఞాపకమని అన్నది
నిరుత్సాహముగ, నిన్ను కోరుటే నా తప్పు

ఇక నా కోరికలు నీ పంచ వాలవులే !
అని గుండె నిబ్బరము చేశాను ! 190

స్వాతంత్ర్య సమరములలో
మనమే చరిత్రను సృష్టిస్తున్నాము
వేరే చరిత్ర చదవడమెందుకు ?
అనేవాడు బులుసు సాంబమూర్తి. 191

అప్పులు ఎట్లా తీర్చాలని
ఆలోచించకు
క్రొత్త అప్పుల ఇచ్చేవారిని వెతుక్కో !
అన్నాడు సాంబమూర్తి
బళ్లారి రాఘవతో ! 192

సులోచనారాణి నవలుల అమ్మి
ఇల్లు కట్టించింది
మైకా వ్యాపారి విదేశాల ఆర్డర్లు
పొంది ఇల్లు కట్టించాడు
కంట్రాక్టరు పనిలో పొదుపుచేసి
ఇల్లు కట్టించాడు
రాజకీయవాది పొలాల అమ్మి
ఇల్లు కట్టించాడు
ఏమైనా, ఇల్లు కట్టించి చూడు
అన్నది సామెత ! 193

ఇంగ్లాండు చరిత్రలో
సర్వశ్రేష్ఠులగు ఆరుగురిని
ఎన్నడానికి యత్నించాడు
ఒక ప్రముఖ పాత్రికేయుడు

షేక్సిపియర్ మిల్టన్‌ను మాత్రము
ఎన్నుకొన్నాడు సాహిత్య రంగంలో
ఇద్దరు క్రియాసాధకులను
ఒక విజ్ఞానవేత్తను
ఒక ధర్మప్రచారకుని
ఎన్నిక చేసాడు. 194

తెలుగువారి చరిత్రలో
సర్వశ్రేష్ఠులగు ఆరుగురిని
పేర్కొన యత్నించాను
వారి అభిరుచులను బట్టి
పేర్లు మారుచునుంటాయి.
సద్గురు త్యాగరాజు, కవిగురు నన్నయ్య
తిక్కన సోమయాజి, కృష్ణదేవరాయలు
వీరేశలింగం, విశ్వేశ్వరయ్యలను
నేను ఎన్నిక చేశాను. 195

ఏ అల ఎటునెట్టితే
అటు పొయ్యేవారు చాలమంది
అలలకు ఎదురుగా
ఈదుకొని పొయ్యేవారు కొంత మంది
అలలతో పోరు సల్పేవారే
ఏదైనా సాధించేది
క్రొత్త తీరాలను చేరేది
క్రొత్త గెలుపులను సాధించేది. 196

పడవకు కావాలె తెడ్డు
నడవడానికి

పడవకు కావాలె లంగరు
నిలువడానికి
పిట్టకు కావాలె రెక్కలు
ఎగురడానికి
పిట్టకు కావాలె గూడు
విశ్రమించడానికి. 197

నిశ్చింతగా బ్రతకాలంటే
మనిషికి కావాలె లక్ష్మి
ఆనందముగా బ్రతకాలంటే
మనిషికి కావాలె సరస్వతి
లక్ష్మీసరస్వతుల భుజాల నెక్కి
రావాలె శాంతి
అప్పుడే సంపూర్ణముగ
జీవిస్తాడు మనిషి! 198

కత్తి ఒరలో దాగినటుల
జీవితము మరణములో
దాగుతుంది
అక్కడే అది భద్రంగా ఉండేది
దుఃఖాల తుప్పు పట్టకుండా ఉండేది! 199

భావాలు తిరిగి తిరిగి
ఎగిరి ఎగిరి
విశ్రమించాయి చీకట్ల దుప్పటిక్రింద
దేహము అలసినటులే
భావపాదాలు అలసిపోతాయి
గుండెకు మాత్రము లేదు అలసట
పుట్టింది మొదలు చచ్చేవరకు! 200

చావు చీకట్లో పొంచి
ఎన్ని పన్నుగడలు పన్నుచుంటుంది !
ఎన్ని రకాల చావులు !
ఎన్ని రకాల పరిస్థితులు !
ముగింపు ఒక్కటే- చావే
త్రోవలు వేరు, డొంకలు వేరు ! 201

మూల్గుల తోరణాల మధ్య
నొప్పుల సింహద్వారాల మధ్య
పుర్రెల దండలతో తిరుగుచుంటుంది చావు
జబ్బుల వలలు, ప్రమాదాల గాలాలు
ఆమె సంచిలోని సామాన్లే ! 202

పుట్టించి ప్రకృతి
తోడనే అప్పగిస్తుంది చావుకు
చావు కన్నుల క్రిందే
పెరిగేది బ్రతుకు !
బ్రతుకు దివ్వె ఆరిపోతుంది
చావు దయ తప్పగానే ! 203

స్త్రీ ఎప్పుడూ నవ్వుచుండినా
బాగుండదు
ఎన్నడూ నవ్వకుండినా
బాగుండదు,
ఆ మోహన మంత్రమును
క్వచిత్‌గా ఉచ్చరిస్తే బాగుంటుంది
కవితలో స్వారస్యము
అంతటా కాన్పిస్తే బాగుండదు
అతి సర్వత్ర వర్జయేత్ ! 204

ప్రజాసేవ వేరు
దేశసేవ వేరు
కళాసేవ వేరు
పదవీహోదా వేరు
ఒక దానితో ఒకటి రంగరించి
వినియోగిస్తే రసాభాస అగుతుంది
ఆత్మవంచన అగుతుంది ! 205

వసంత సంపదా, చెలీ !
నిన్నుకాంచిన తరి
రాగఝరీ తీరాల అంచుల
చేరినట్లు ఉంటుంది ! 206

చుట్టాలు స్నేహితులు చుట్టూ ఉన్నారు
ఆమె ఎక్కడనుంచో ఎందుకో వచ్చింది
దృష్టి అంతా ఆమెమీదే
వలపులన్నీ ఆమెమీదే ! 207

నిద్రించిన నిశీథములో
విహరించే స్వప్నాలు
హృదిలో పొదిగే భావాలు
విశ్రమించాయి ఆమె ముఖఫలకములో. 208

మెదడు బదలియున్నది
దుఃఖాలు మూగుచున్నవి
కలలు మేల్కొనుచున్నవి. 209

కలలు ఎట్లా పుట్టునో
ఎందుకు పుట్టునో

దీర్ఘ భవిష్యత్తుకు
పునాదులు వేస్తాయి కొన్ని కొన్ని ! 210

నిద్రామాగాణములలోనే
విహరిస్తుంటాయి స్వప్నహరిణాలు ! 211

నిశీథ తిమిరాల్లో
స్వప్న విహంగాలు
ఏమి వెదకుచున్నవో !
ఏ తీరని కోర్కెల కొమ్మలనో
ఏమరచిన గూటి చిదుగులనో ! 212

దిగంత సిందూరకపోలాలపై
శుక్రతార చందన తిలకముగ ఉన్నది ! 213

దేహము దృఢముగా ఉండినది
వాంఛల ఆనందాలు దుఃఖాలు
అదుపులో ఉన్నాయి
దేహము శుష్కించినది
వాంఛలు అదుపు తప్పి పర్విడినాయి ! 214

ప్రాయములోని లేత కోరికలు
ముదిమిలో ముదిరి ప్రమగ్గినవా !
లేకున్న ఏమిటీ వాంఛల
ఆనందపు ఊరేగింపులు !
పేరంటాండ్ర వేషాలతో ఉత్సాహాలతో ! 215

ఈ వయస్సున శృంగార కవిత్వాలు
ఎందుకు వ్రాస్తున్నారు ?

చిన్నతనమున శక్తిలేక అన్నాను
ఆమె ప్రశ్నకు !
భావాలకు లేదు రిటైరుమెంటు
స్మరణలకు లేదు ముదిమి
పాతబడేది భాషగాని
కవిత్వము కాదు ! 216

నిదురించిన రాతిరిలో
రేగిన శిరోజాలా
ఈ నల్లమబ్బుల అలల దండలు !
ఎందులకో ముసిరాయి
ఆవేశాల రేకొత్తుచు ! 217

కొన్ని పేనా విసరులతో
నేను ఏమి చేశాను
కొన్ని జీవన రహస్యాలను
బయట ఆరబోశాను ! 218

కవితా యౌవనీ
నీ నుండి సెలవు తీసుకొనుచున్నాను
ఓరిమితో మెలగు
పాత కవితలకు నిద్ర వస్తున్నది
క్రొత్త పాటలు పాడి లేపు ! 219

నిప్పురవ్వల చురచురలు
ఇక నిలపిన మేలు
రైలులో మార్చిలో రేగిన రవ్వలు
ఆరుచున్నాయి

ఇక ముక్తకాలు వ్రాస్తే గీస్తే
చల్లనివై ఉండాలె
హాయిని కూర్చేవిగా ఉండాలె
ఇవి ఆమె పంచకానికి బోనస్

—కొసరు లాభం !

10-3-83 }
26-8-83 } మధ్యలో



# తుషారాలు

అధరామృతమని
　　　　ఘోషిస్తాయి కావ్యాలు !
ఈ అమృతాన్ని క్రోలి
　　　　ఎవరైనా అమరులైనారా !
　　　　　　　　అనిమేషులైనారా !
కవి సమయాలను పేరుతో
ఏదైనా చెల్లుతుంది సాహిత్యములో ! 1

ఆమె నాకొక దేవత
ఇంట్లో పనికత్తె మాదిరి
పని చేస్తుంటే
దేవతలూ పని చేయవలసిందేనా
మనుష్యుల మాదిరి అని నిట్టూర్చినాను ! 2

పాతలో మంచిని
క్రొత్తలో మంచిని మేళవించి
సంరక్షించుకోవాలని సలహా యిస్తారు !
వివరాలు ఎవరూ విశదీకరించరు !
జల్లెడ పట్టి మంచిని వేరుచేసే
　　　　పని సాధ్యమా !
మంచి అంటే, కొందరికా
　　　　అందరికా ? 3

కురులు బిగించి ముడివేసి
చుట్టవేస్తే ఒక అందం
జారవదలి పూదండ కట్టితే
మరొక అందం
మొగ్గగ ఉంటే ఒక అందం !
పువ్వుగ పూస్తే మరొక అందం ! 4

కుదించి చెప్పితే ఒక అందం కవితకు
వర్ణనలతో వివరించి చెప్పితే
మరొక అందం
బాలచంద్రునిలో ఒక అందం !
దశమి చంద్రునిలో మరొక అందం ! 5

కృష్ణ బాలక్రీడలు ఆనందము
కలిగిస్తాయి కొందరికి
రాసక్రీడలు ఆనందము
కలిగిస్తాయి మరికొందరికి
అంగుళుల అలంకరించే పుష్పము
ఇష్టము కొందరికి !
కంఠమును అలంకరించే పువ్వుదండలు
ఇష్టము మరికొందరికి ! 6

పారిజాతము ఇష్టము సత్యభామకు
తులసిమాలలు ఇష్టము రుక్మిణికి
ముద్దు ఇష్టము కొందరికి !
కౌగిలి ఇష్టము మరికొందరికి ! 7

గజల్ ఇష్టము కొందరికి
కాదంబరి ఇష్టము కొందరికి

కందము ఇష్టము తిక్కన్నకు
సీసము శ్రీనాథునికి. 8

వారాంతపు సెలవులు అనుకూలము
కొందరికి
దశరా ఎండాకాలాల సెలవులు
అనుకూలము కొందరికి
భావకవిత కొందరికి
నవల కొందరికి. 9

తలుపు తట్టి, రమ్మంటే లోపల
రావాలె అన్నది దొరసాని
నేను సరియగు దుస్తులతో
లేకపోవచ్చును గదా!
లేదమ్మా, తాళపు బెజ్జంగుండ
చూచే లోపల వస్తాను అన్నాడు
చైనా నౌకరు! 10

బంగారు దొంగ రవాణా కారును
నిలిపారు ఉద్యోగులు
చాలసేపు వెదకగా, కనుగొన్నారు
బంగారు దాచినచోటును
భేష్, పట్టుబడ్డాను
మా వ్యాపారపు జూదములో
ఇదీ ఒక అంశమే
తొమ్మిదిసార్లు మేము గెలుస్తాము
ఒక్కసారి మీరు అని నవ్వాడు
పరదేశపు దొర!
జైలులో పడ్డాడు! 11

దేశమానము రాష్ట్రమానము
కాలమానము దేహమానము
అన్నీ మబ్బులు మబ్బులుగా ఉన్నాయి,
అన్నీ నా జీవన మానములో
మారు పలుకుచున్నాయి ! 12

స్ఫులింగాలు ముగించి
తుషారాలు ప్రారంభించాను
వేడి తర్వాత చల్లదనాన్ని
ఎందులకో లేవనెత్తుచున్నాను !
ఎల్లల మీరిన కొసరుల అలలు
ఆత్మానందమా, ఆత్మవంచనా !
నిరుద్దేశ ఊహా విహారాలు ! 13

మధ్యయుగములో దశాబ్దాలు
శతాబ్దాలు స్తబ్ధముగ విశ్రమించాయి
ఎరగక పెరగక మూలబడి ఉండినాయి
వర్తమాన కాలములో శతాబ్దాలు
దశాబ్దాల వేగముతో దుముకుచున్నాయి
ఎట్టి ద్రుతసంగీతమును వింటున్నాము
ఇంకా వినబోతున్నాము. 14

పాతకాలాల్లో
మనుష్యుల వసతికి తగ్గట్లు
కట్టారు ఇళ్లు
ఈ కాలములో
ఇళ్ల అందాలకు తగ్గట్లు
సర్దుకోవాలె మనుష్యులు ! 15

బావో మరిదో సరేగాని
పరాయి వానితో ఆమెకు
చుట్టరికమని ఆక్షేపించింది
ఎవరి తప్పు వారు
సమర్థించుకోవాలె గదా ! 16

కోరేవారికి ఏ అడ్డులూ లేవు !
చేసేవారికే అన్ని ఇబ్బందులు !
చేయతగినదా, కాదా అని నిర్ణయించుకోవాలె
చేయగలనా, లేదా
విచారించుకోవాలె
చాల కోర్కెలను మౌనంగ
నిరాకరించుటే మేలు
ముఖ్యంగ పదవిలో నుండినవారు. 17

చేసేవారు
ఆడిగేవారికి లోకువ
కొందరు ఏ పనీ చేయక
చేసేవారిమీద అరుస్తుంటారు
కరుస్తుంటారు
అదే వారి వృత్తి, వినోదము ! 18

ఏ అవయవానికి జబ్బు చేసినా
తెలిసికొనేది మెదడు
మెదడుకే జబ్బుచేస్తే
తెలిసికొనేది ఎవరు ?
సంఘ దోషాలను సవరించాలిసింది
నాయకత్వము
నాయకత్వమే కలుషితపడితే
చేయగలిగనదేమి ? 19

ఆకాశము సంతోషించి
భూమిని సంతోషపెట్టిన వర్షాలు
సెప్టెంబరులో కేరళలో
విరమించ లేకున్నాయి
పోవాలె పోవాలె అంటున్నవే కాని
పోలేకున్నాయి
భూవిరహాన్ని ఓర్వలేకున్నాయి. 20

దిగంతముల నుండి ఆకాశము
మబ్బు ఉత్తరముల పంపుచున్నది
భూమికి
వియోగాశ్రువుల రాలుస్తున్నది
వేదనా చీత్కారముల సలుపుచున్నది
భూమ్యాకాశముల మధుమాసము
సమాప్తమగుచున్నదని
భయవిహ్వలత ! 21

వర్తమానము విషదంతములతో
కాటువేయుచున్నది
భవిష్యత్తు ఇంద్రధనుసుల
తోరణాలతో వెన్నెల చాందినీతో
స్వాగతము పలుకబోవుచున్నది
నిన్న నేటి పోరాటములలో ఓడినా
తుది విజయము తనదేయను
ఓదార్పు భవిష్యత్తుకు ! 22

ఆ మహాకవి పుట్టింది
కుగ్రామములో కుటీరములో

చనిపోయింది చిన్న ఇంటిలో
మహానగరములో
నేడు ఆయన స్మారక మందిరము
విశాల భవనములో
శిలావిగ్రహ శోభితము. 23

తెలుగు సాహిత్యమే తెలిపినవారికి
తెలుగు సాహిత్యపు రుచి ఏమి తెలుసు ?
మడుగుల లోతులు ఏరులవడి
బావి కప్పకు ఏమి తెలుసు ? 24

ఈ మాటలకు ఏమి ఆధారము
పేరులేని ఫిర్యాదులు
తప్పు పేర్ల ఫిర్యాదులు
అంతా పుకారు
జానపద సాహిత్యము (నోట నోట
ప్రచారము)
పురజన యక్షగానాలు (వేడుకలు) 25

నా వాడి వేడి మాటల జాడలు
నీ గుండెను కలత పెట్టినాయి
అవి మచ్చులు కాకూడదు
పువ్వులే పూయాలె ! 26

సౌందర్య మందిరమును
నీ దేహపాత్ర ఉంచుకొన లేకున్నది
పైకి ఒలికి పడుచున్నది
చిరునవ్వులలో
క్రీగంటి చూపులలో
చెక్కిళ్ల ముంగురులలో. 27

రాత్రి స్నేహము
ప్రొద్దుటికే మంచై కరిగిపోవుచున్నది
స్మృతి కుహరములో
మరుగున పడుచున్నది ! 28

దిక్కుల మరచిన పిట్టలవలె
ఆసక్తులు ఆందోళన పడుచున్నవి
భయాలు నెత్తురు మరిగిన పులులవలె
బీభత్సము చేయుచున్నవి ! 29

ఆహ్లాద సంభాషణా బాహువులు
                నన్ను వదలకున్నవి
నా త్రోవను అడ్డి
        వెనుకనుండి లాగుచున్నవి
                చూపుల సాయముతో ! 30

నేను వెడలే వేళ
వెనుకనుండి ఎవరో
        పిలుచునట్లుంటుంది
మురళీ మాధుర్యముతో
వెన్నెల వెలుగులతో ! 31

నేను సెలవు తీసుకొని
        వెడలే వేళ
గాలి నిలపుకొన్న
        చక్రాల బండివలె ఉంటిని
కొద్ది దూరము చనగానే
        దుఃఖము ముంచుకవచ్చింది !
ఎడబాటు త్రాళ్లు వెనుకకు లాగ
        మరలి వచ్చినాను ! 32

గుండెలో పారే
నెత్తురు మంటలను
కన్నీళ్ల ఆర్పలేవు !
నూనెవలె ఎగత్రోసి
ఎక్కువ చేస్తున్నాయి ! 33

చెలియ కాటుక కన్నుల
రంగుమట్టిని
పదునుచేయి కన్నీటిని చల్లి !
గుండె నెత్తురు ఎరువు చల్లి
కోరిక విత్తుల చల్లుము
చూస్తాము, ఎట్టి పువ్వుల పూస్తుందో !
ఎట్టి పండ్లను కాస్తుందో ! 34

కోరికల మండే తూపులు
ఎన్నో ఉన్నవి గుండె అంబుల పొదిలో !
వేచియున్నవి వలపు విల్లు ఎక్కి
గురివైపు స్వారి చేయుటకు
ఇంతలో పొదినే మాడుస్తున్నవి ! 35

కోరికలు ఒక్కొక్క తూరి
జింకలవలె గంతులేస్తు పోతున్నవి
ఒక్కొక్కసారి
ఏనుగులవలె ఊగుచు నడుస్తున్నవి
దిగులు పొదలను గుంటలను
దాటుకొంటు వెడలుచున్నవి. 36

కోరికలే వగపుల అడుసులో పడకుండ
త్రోవలో బిగించిన శిలాఫలకాలు
ఆశల ఫలాలను అందిస్తాయి

నిరాశల ముసలి ఆకులను అందిస్తాయి
ఉండినచోట ఉండనియ్యవు !
ఇటునటు ఊపుచునే ఉన్నాయి ! 37

సంధ్యాకాశము
ఒంటిమీద విభూతిరేఖలు
నొసటను కుంకుమబొట్టు
తాలిచి పురోహితునివలె ఉన్నది
రజనీదేవికిని
సుధాకరునికి
దాంపత్యపు ముడులవేశాడు
చుక్కలు అక్షింతల జల్లినాయి. 38

ప్రేయసి దారిలో
జాలిని పుట్టించే
నా రక్తపతాకము
మినమినలాడింది
నాకు సంతోషముగనే ఉండినది
మనోహరి పెదవుల వన్నెను
ధూళిదర్పణము చూపుచున్నది ! 39

బ్రతుకు ఏమిటి ?
బీదవాని మాసినబట్ట
కొరతల అతుకులు
అనుదినము కుట్టుచునే ఉన్నారు. 40

రంగురంగుల మబ్బులు
ఆకసమున చేరాయి
శత్రువుల గుడారాలా !
మంత్రగాని ఉచ్చుల వలలా !

ప్రభంజనుని శరపరంపరలు
చెల్లాచెదరు చేశాయి
వర్ష బిందువులు అక్షంతలవలె
భూమిని ఆశీర్వదించాయి. 41

న్యూయార్కుకై పడమటగా పోతాము
క్యాలిఫోర్నియాకై తూర్పుగా పోతాము
రెండు అమెరికాలోనివే
దిక్కులు వేరైనా
గమ్యదేశము ఒకటే!
తూర్పు పడమరలు ముద్దిడేచోటు! 42

ఏకాంతములో ఒక్కొక్కప్పుడు
కాలమే దీర్ఘమగునటుల తోచును
దుఃఖాలు చిక్కనై గుండెను
ముసురుచున్నట్లు తోచును
సుఖాలు లేనట్లే శుష్కించినటుల తోచును! 43

అతడు సోమరిగానే ప్రొద్దుపుచ్చుచున్నాడు
ఏ ఉపయోగకారియైన పని చేసినట్లు కాన్పించడు
కాని ఏదో శుభతరుణముననో
ఏ అవకాశమో ఏ ఆహ్వానమో
ఏదో ప్రేరణ రాగానే
మేల్కొన్న గరుత్మంతునివలె
క్రొత్త మిన్నుల ఎత్తులకు
ఎగురుతాడు మెరుపువలె
మెరుస్తాడు
పరిచయుల విస్మయమగుతాడు! 44

మునలితనము ఎందులకా !
బక్కచిక్కిన, చితికిన కోరికలను
పూడ్చిపెట్టుటకు !
కొరగాని కలతల త్రుప్పుతో
పాతి పెట్టుటకు !
చిగురులు పెట్టని ఆశల మోడులను
తగుల బెట్టుటకు
క్రొత్త స్వప్నాలకు క్షేమమైన
ప్రాయమది ! 45

వారసత్వముగ లభ్యమైన సంపద
అంచులమీద జీవించుచున్నాడు
ఆస్తికందలు కరగిపోగా
ఎండుచున్న ఎముకల కొరుకుచున్నాడు
యౌవన విలాస కాలమును
దూషించుచున్నాడు. 46

నవలాకారుడు
చుట్టు ఉన్న సమాజ స్థితులను
వర్ణింప భయపడేవాడు
చరిత్ర సురంగముల చొచ్చి
భూతకాల మసకల దేశాన్ని
ఆనాటి జీవితాన్ని ఊహలతో రంగరించి
ధూళిధూసరిత ఉదంతాలతో
వర్ణించి స్వేచ్ఛగ వ్రాసేవాడు. 47

కవి వదలినది ఏమి చావుతో
తీర్చని బాకీలు !
అచ్చుకాని వ్రాతప్రతులు !

అచ్చై అమ్మని పుస్తకాలు !
ఊరిజనుల పాలకులపై కొన్ని పద్యాలు
ఛలోక్తులు !
మంచి పండితుడు సరసుడు
ఆర్య మర్యాదను విక్రయించని
సరస స్వభావుడను కీర్తి
అందరి పెదవుల మీద ! 48

రోగిని పట్టణానికి తరలించారు
చికిత్సకై
రెండు మూడు వారాలు నొప్పితో
బాధ పడ్డాడు
ధనము హెచ్చుగా వ్యయమైనది
రోగి శవమై యింటికి వచ్చాడు
పట్టణానికి పోయి
మృత్యువును ఎచ్చు ధరకే
కొని తీసుకవచ్చాడు. 49

నాకూ నా సమస్యల సరస్సులు ఉన్నాయి !
వేదన కల్గించే చిక్కులే !
నా స్వభావము చేతనో,
నా సంస్కృతి చేతనో
ఆ చిక్కు వలలో చిక్కక
సంతోషముగనే గడుపుచున్నాను
సరస్సులో విహరించే
హంసవలె ఉన్నాను. 50

ఆమె కుడిపైటను వేయగలదు
ఎడమ పైటను వేయగలదు

ఒక జడను వేయగలదు
రెండు జడలనూ !
వేషము ఏమైనా కమలము
కమలమే !
ఈల వేస్తూ భ్రమరము తిరుగుచునే యున్నది. 51

ఒకడికి తిండికన్న త్రాగుడుకే
ఎక్కువ ఖర్చు
ఒకనికి ఇంటికన్న క్లబ్బుకే
ఎక్కువ ఖర్చు !
ఆమెకు అలంకార ద్రవ్యముల మీద
ఎక్కువ ఖర్చు !
ఒకనికి మందుల మీద
ఎక్కువ ఖర్చు !
నాకు ప్రయాణాల మీద
ఎక్కువ ఖర్చు ! 52

నా జ్ఞాపకాలు గుంపులు గుంపులుగా
మెదడులో విహరిస్తున్నాయి
క్రొత్త తలంపుకీ స్థానములేదు
మెదడు పాతవాటికే అలవాటైపోయింది ! 53

కలలలో ఒయ్యారమే అందం
కలకు గిలిగింతలు పెట్టడం
ప్రేమ అగుతుంది
స్వప్న సౌందర్యాంశమే ప్రేమ !
క్రొత్త లోకాన్ని సృష్టిస్తుంది. 54

త్వరలో మరచేవాడు మానవుడు
ఎవరికొరకో జీవితమంతా ఏడుస్తాడు

దాన్నే వేదాంతము మాయ అంటుంది !
సాహిత్యము ప్రేమ అంటుంది ! 55

ఇప్పుడు ఎవరిమీద విశ్వాసము లేదు
నీ మీదకూడ విశ్వాసం పోయింది
నిరాశల ఛాయలో బ్రతుకును త్రిప్పుచున్నాను
జ్ఞాపకాల నెమరువేయుటకును
ఓపిక లేదు. 56

నీతికి న్యాయానికి వ్యాజ్యము పడింది
కోర్టువారు విచారించి తీర్పునిచ్చారు
న్యాయానికి అనుకూలముగ
నీతికి స్థానము లేదా న్యాయస్థానములో అని
ముక్కుమీద వ్రేలు వేసింది నీతి ! 57

ప్రేమించడానికి భయపడతారు
ఈతరమువారు
సంఘపు పాముకాట్లకు భయపడుతారు
ముందుతరాలవారు చెడ్డ పేరుకు
లెక్కచేయక ప్రేమించేవారు
ఆ దినాలలో ప్రేమకు
తీరిక, ఓపిక ఉండేది ! 58

రేపు గాంధి జయంతి గదా
ఏమి చేస్తావు అని అడిగాను- ఇల్లాలును
ఉపవాసాల ప్రార్థనల దినము గదా అన్నది !
పెద్దగ నవ్వుకొని మిన్నకుండినాను. 59

కట్టుదిట్టములకు లోనై యుండిన
ఇల్లు తారుమారైంది భార్య చనిపోగ

ఆయన ఏకాంతములోకి ప్రవేశించారు
అనాహూతులుగ
స్నేహితులు దురభ్యాసపు జండాలతో. 60

ప్రజాస్వామికములో
పది మంది మేధావుల భావాలకన్న
నూరుమంది నిరక్షరాస్యుల
భావాలకే విలువ !
న్యాయస్థానములో
ఇరువది మంది వకీళ్ల అభిప్రాయాల కన్న
ఒక్క జడ్జీ అభిప్రాయానికే విలువ హెచ్చు ! 61

యౌవనము పోయిందని విలపించడం
యౌవనము తిరిగి రావాలని అభిలషించడం
చీకట్లో సరససల్లాపాలు ఆడుటకేనా
మరేదైన ఘనకార్య సంకల్పమా ?
పెద్ద యుద్ధములో గెలుపొందుటకా !
జన్మరాహిత్యమునకు దీక్ష పూనుటకా ! 62

కాలవక్షముపై దీపము వెలిగించాడు
త్రోవలో నిద్రించే రేణువులను మేల్కొలిపినాడు
కొన్నిటిపై చీకటిమబ్బుల పరచినాడు
కొన్నిటిపై వెలుగుల చల్లినాడు
వెలుగు చీకట్ల పండుగను చవిచూచాడు. 63

సహస్ర శ్రద్ధలతో అనురాగాలతో
నన్ను సమర్పింపుకొనుచున్నా
నీవు అనురక్తవు కాకపోయినా
నేను నిరాశుడను కాలేదు

మందిరము మిగిలియున్నదీ
వెన్నెల మిగిలియున్నది
నీ నా మధ్య ఇచ్చిపుచ్చుకోవడాలు
ఇంకా చాల మిగిలి ఉన్నవి. 64

పేరు ప్రఖ్యాతులు లేనపుడు
పత్రికలలో విమర్శలు లేవు
జనుల నాలుకలపై తిట్లు చీవాట్లు లేవు
కొంత పేరు సంపాదించగనే
జనులు పత్రికలు నన్ను వెంటాడుచున్నవి
వేటాడుచున్నవి
అందుకనే పేరును అభిలషిస్తున్నాను! 65

సరియగు స్వాగతము లేక
జరాస్వాములవారు వేంచేయరు !
పన్నులు వదలి రాలిపోవాలె
కన్నుల చూపు మందగించాలె
కళ్లజోడు వేయాలె
చెవులు పెద్దగ పల్కని మాటల విననేరవు
చందనము రాయాలె కేశములకు
ఒంటి ముదతల రత్నకంబళ్లపై వచ్చి
స్వామిజీ కూర్చుంటారు- అప్పుడు
మృత్యుపురాణాన్ని గరుడపురాణాన్ని
వినిపిస్తారు ! 66

సౌందర్యాన్ని సృష్టించి
ఆకర్షణల కావించి
వలపుల రేకెత్తించి
కామసూత్రాలతో ప్రేమను ఈడ్పించి

దుఃఖాల సంతలో పడవేస్తున్నావు
ఎందులకో ఈ పరీక్షలు
అపనిందలు ! 67

నీళ్ల కరువు నీళ్ల వరద
ప్రకృతి నిష్ఠుర చర్యలే !
ధరణిపై దురాక్రమణలే !
నీరు స్వశక్తి ప్రతాపాన్ని చూపే
అవకాశాలు
యౌవన విజృంభణలో ! వికారాలో ! 68

శూన్యములో విహరించే
దిగ్వధువులు
ఎన్ని లక్షల కలశముల నీరు
క్రుమ్మరించారో వరదల మేల్కొలుపుటకు !
ఎట్టి బీభత్స క్రీడ ఇది
ప్రళయ దుందుభుల మ్రోయిస్తూ
సలిలధారలా ?
విషాద హాలాహల ధారలా !
వన్నె తరిగిన నెత్తురు ఏరులా !
మరణాదేశముల వ్రాసే సిరా
జల్లులా ? 69

మండే మంటలు వందల ఇండ్లకు
బాధ కలిగిస్తాయి
చల్లని నీళ్ల వందల గ్రామాలకు
బాధ కలిగిస్తాయి

పశువులకు పొలాలకు జనులకు
విశేష నష్టము కలిగించి
ఆక్రందనల మేళవించే వరదలు
దినాల తరబడి బాధ కలిగిస్తాయి. 70

నా ముక్తకాలు
హఠయోగములోని ఆసనాలు !
ఊపిరి బిగపట్టిన కుదింపులు !
దీర్ఘకవితలు
విశాల క్రీడాభూమిలో విహారాలు
స్వేచ్ఛగా సంచరించేవి. 71

ఇలలో కలవు
గవాక్షాలు, కవాటాలు
ఆవరణ కుడ్యాలు
ఆకాశములో అడ్డంకులు లేవు
ఆకాశము విహారానికి !
ధరణి వసించడానికి ! 72

ప్రమాణాలు లేకుంటే
దిగంత కవాటాలు మూసినట్లుంటాయి
హృదయ గవాక్షాలు బిగించినట్లుంటాయి !
అప్పుడప్పుడు క్రొత్త దృశ్యాలు
క్రొత్త స్వరాలు ఎదురుపడాలె
ఊపిరితిత్తులలోకి క్రొత్త వాయువులు పోవాలె ! 73

రాత్రి తిమిరాలలో
తారాజపమాలతో
దినము ప్రార్థించుచున్నది
సూర్యదర్శనము కొరకు ! 74

సముద్ర తరంగాలు
ఉత్సాహముతో పైకి ఎగయుచున్నవి
ఆవేశముతో పిలుచుచున్నవి
ఆకాశాన్ని ముద్దిడడానికి. 75

ఊరిలో నివసించే ఇండ్లు
ఊరిబయట పూజలు సలిపే దేవాలయము
ఊరిబయటే పూజలు
ఊరిలో పని పాటలు ! 76

సంధ్యాసూర్యుడు
బాగా మ్రగ్గిన పండువలె ఉన్నాడు ఎర్రగా
రజనీదేవి
ఛాయాకరములతో కోయ యత్నించుచున్నది
పండును
మబ్బుల మాటున కదలుచున్నది పండు ! 77

కాన్పించక జ్ఞాపకాల పంపుట
నీ యత్నం
జ్ఞాపకాల పట్టును తప్పుకొనుట
నా యత్నం
నీ నా యత్నాల పోరులో
రాత్రి పోయింది, నిద్ర రాలేదు. 78

వసంత ఉదయము నవ్వుచు
నా ముంగిట చేరింది
స్వాగతమిచ్చి హృదయాన్ని
నింపుకోలేకపోయాను
విరహాశ్రువుల కార్చిన నయనాలు
చెమ్మగనే ఉన్నాయి

నవ్వు కన్నీటిలో మినమినలాడింది !
ఉదయము సౌరభముల
నిట్టూర్చింది ! 79

నింగిలో చంద్రుడు పయనించుచున్నాడు
అప్పుడప్పుడు మబ్బుల మాటున చేరుచున్నాడు
వీథి వెలుగుల తప్పుకొనుటకు
కొంగుమాటున ముఖము దాచే
అభిసారిక జ్ఞాపకాని కొచ్చింది. 80

పగటి ఎండలలో వేగి
మాటలు పోగొట్టుకొన్న వేదన
రాత్రి చీకట్లలో తునకలై
చుక్కలలో మినుకులాడింది ! 81

మలయానిల మురళితో
ప్రసన్నముగ వచ్చాడు వసంతుడు
శిశిరములో మూర్ఛిల్లిన
నందనవనము కన్నుల తెరచింది
పల్లవములు తోరణాలు కట్టాయి
పక్షులు స్వాగతము పలికాయి
వనశాప విమోచన శుభసమయ మది ! 82

వనశోభగా ఉన్నది ప్రసూనము
బాగా వికసించి పరిమళముల ప్రసవించింది
సుగంధ సందేశము
ఎట్లా దశదిశల ప్రచారమయ్యేది
వసంతానిల సేవాతత్పరత లేకున్న ? 83

దీపకాంతి శలభము
ప్రేయసీ ప్రియులు
సౌందర్యానికి మోజుపడి
దహించుక పోతుంది
అక్లే పువ్వు బుల్‌బుల్ ప్రేమికులు
బుల్‌బుల్ విలపించి విలపించి
పైకి ఎగిరి పువ్వుమీద పడుతుంది
పువ్వు ముల్లు గుచ్చుకొని చనిపోతుంది !
సౌందర్యములోని ప్రేమ కోరేది
ఆత్మత్యాగము
ప్రేమను పరీక్షించే
నికషోపలాలు
పర్షియన్ సాహిత్యములో
ప్రధాన ఘట్టసోపానాలు ! 84

చందన చర్చిత గాత్రయై
కుంకుమ తిలక లలాటయై
సంధ్యాదేవి బయలుదేరింది
యామినీదేవిని కలియుటకు
ఇంతలో, నల్లని బోయలు మోయుచున్న
చుక్కల పల్లకి ఎదురైనది
శుక్రధ్వజముతో
యామిని స్వయముగ వచ్చివేసినది. 85

చంద్రుని పిదప ఆకసమున
కాంతివంతమైనది శుక్రగోళము
గ్రహములలో అందాలరాణి
గగనములో కస్తూరీ తిలకమువలె ఉంటుంది

కొన్ని వేళల వేకువన, కొన్ని వేళల
సూర్యాస్తపు తర్వాత కాన్పిస్తుంది. 86

ఢిల్లీ నగరములో
చలికాలపు చరణధ్వనులు
సన్నగ వినబడుతున్నాయి
త్వరలో వచ్చి ఋతు మండపములో ప్రవేశిస్తుంది
సరళలాస్యముతో ప్రారంభించి
జటిల జతిస్వరముల నృత్యము చేస్తుంది!
భరతనాట్యములో లేని అడుగుల ప్రదర్శిస్తుంది! 87

అంబర విహారానికి
ఉపయుక్తములు రెక్కలు
గూటిలో చేరి పరుండుటకు పనికి రావు
ఆఫీసు వేషము నిద్రకు సరిగాదు
మెదడు రెక్కల ముడిచి
కన్నుల మూస్తేగాని నిద్రరాదు! 88

కోయిల వింత పక్షి!
నేలమీద ఎన్నడు కాన్పించదు
ఆకసములో ఎగురుచు కాన్పించదు
కొమ్మనుండి కొమ్మకు ఎగురుచు కనబడుతుంది
ఆకుల మాటున కూయుచు ఉంటుంది
వసంత గ్రీష్మములలో పాడుతుంది
తర్వాత ఏమౌతుందో. 89

సలహాదారులందరు
అంతరంగికులు కారు
అంతరంగికులు ఆప్తమిత్రులు కారు

ఆప్తమిత్రులు అభిమానపాత్రులు కారు
అభిమానపాత్రులు ప్రేమపాత్రులు కారు ! 90

ఏ ఇద్దరు ఒకటి కారు
వారి వారి స్వభావాలు, అభిరుచులు
నడవడులు, ఉద్వేగాలు, ఉల్లాసాలు
వేరువేరుగ వారిని మలుచుతాయి
అదే మానవుని విశిష్టత ! 91

మానవులు గ్రీన్‌లాండులో ఉన్నా,
ఐస్‌లాండ్‌లో ఉన్నా,
ఆఫ్రికాలో ఉన్నా, ఆసియాలో ఉన్నా
కొన్ని మౌలిక ప్రవృత్తులు ఆచరణలు
అందరికీ సమానము
శృంగార విషయములో
అందరూ ఒకటే !
కామవాంఛలో సమానత్వము
కాన్పిస్తుంది. 92

సమానత్వాలు ప్రత్యేకతలు
మానవుని ఉత్కృష్టతలు
అవే వాని గర్వకారణాలు
సమానత్వాలు మానవ జీవితాన్ని
తంబూరాను చేస్తాయి
ప్రత్యేకతలు సహస్రతంత్రీ విపంచిని చేస్తాయి.
సరిగమ పదనిసల సంగీతము ఒక్కటే
రాగరాగిణులు అనేకములు ! 93

కామము మునీశ్వరులను
తపోధనులను మాత్రము కాదు
సంఘ నాయకులను క్రిందకు తోస్తుంది!
బ్రహ్మర్షులు, రాజర్షులు, నాయకులు
సమానముగ బలి అగుతారు
అగ్నికి ఏ పాత్రలో పెట్టినా వెన్న కరుగుతుంది
శివుడు బ్రహ్మ దారి చూపారు! 94

ఒక్కొక్క తూరి
న్యాయానికి నీతి బలమీయదు!
నీతికి న్యాయము బలమీయదు!
భౌతిక వ్యవహారాల్లో
న్యాయమే అమలు జరుగుతుంది
నీతిలేని న్యాయము గుడ్డిదే కుంటిదే!
మూడుయేడులు దాటిన ప్రోనోటు చెల్లదు
—అది న్యాయము!
చెల్లేది నీతిరాజ్యములోనే
—అది ధర్మము! 95

ఎంత నేర్చినా ఎంత చూచినా
ఎంతవారలైనా కాంతదాసులే
అని త్యాగయ్య ఎందుకు పాడేడో
ఏమి విన్నాడో!
స్వంత అనుభవములో కామవికారము
కాదు గదా! 96

ఢిల్లీలో అక్టోబరులో
చలికాలము పూతవేస్తున్నది

పూత ముదరాలె, పిందెలు కాయాలె
కాయలై పండాలె !
సంక్రాంతికి భక్ష్యయోగ్యమగుతాయి
ఆదే చలికాలపు నిండు యౌవనము ! 97

వ్యవసాయపు శాస్త్రజ్ఞులు
పంటలపై పరిశోధన చేస్తారు
కొందరు భూగర్భంలోని
లోహాల గూర్చి చేస్తారు
కొందరు సముద్రగర్భంలోని
తైలాలగూర్చి శోధిస్తారు
కొందరు గాలులు తుఫానులు
మబ్బులు వానలగూర్చి శోధిస్తారు
నోబెల్ బహుమతి గ్రహీత
చంద్రశేఖర్ నక్షత్రాల గూర్చి చేస్తాడు
కోట్ల కోట్ల మైళ్ల దూరములో యున్న
నక్షత్రాల గూర్చి ! 98

కొంగు ముడి విప్పని ప్రకృతి
పరిశోధనలకు లొంగుతుంది
లొంగుచున్నా అనంతాలు ఆమె
రహస్యాలు !
రహస్యాల అంచులకు చేరలేడు
మానవుడు
చేరినపుడు మానవుడు మారిపోతాడు
దేవుడే అవుతాడు
అహం బ్రహ్మ అని అప్పుడు
నిజంగా అంటాడు ! 99

పూజారులు అనేక రంగులవారు
నిరీశ్వర పూజారులు
మూర్తి పూజారులు
సమాధి పూజారులు
సిలువ పూజారులు
పదవీ పూజారులు
సమయ పూజారులు
అలసత్వపు పూజారులు
మిన్నగ సౌందర్య పూజారులు ! 100

నా కావ్యపఠన విన్న పండితుడు
మీ అనుభవాల ఆత్మకథ అన్నాడు
కాదండీ, అనుభవాల ఆత్మకథ కాదు
భావాల ఆత్మకథ కాదు
కేవలము కల్పనల కథ అన్నాను ! 101

నా జీవితములో దుఃఖపడిన
సమయాలు ఎక్కువ లేవు
సుఖపడిన సమయాలు ఎక్కువ లేవు
నా వగపులు వలపులు
కల్పనా నిర్మాణాలే!
దుఃఖసాగర సంజాతలు కావు !
సుఖనందన పాలితలు కావు !
కనబడని దేవుని ఉపాసనలు
చూడని సౌందర్య ఉపాసనలు. 102

హృదయాన్ని భూరి ఆకర్షణ
శక్తికి లోనై క్రింద పడనీయరాదు
శూన్యములో ఎగిరి పోనీయరాదు

అంతరిక్షములోనే ఉంచాలె
కార్య సమీరాలచేత
భావ పక్షాలచేత
అంతరిక్షములోనే
సాటిలైట్ వలె ఉంచాలె! 103

చంద్రుని అందము
చంద్రునికేమి తెలుసు!
రాత్రికి తెలుసు
పర్వతము ఎత్తు ఎంతో
ఎత్తుకు తెలియదు
లోయకు తెలుసు
పురుషుని అందము
స్త్రీకి తెలుసు
స్త్రీ అందము అందరికి తెలుసు
వ్యతిరేకతల విజ్ఞానమిది! 104

తృష్ణను తీర్చే పానీయములకై
బయలుదేరాను పుడమి తోటలోకి
దప్పిక ఎక్కువ చేసే సామగ్రే
సంప్రాప్తమైనది?
ఎండమావుల పాదాలు చురుకుగ
పరుగిడుచున్నవి!
జింకలు దప్పికతో పడిపోవుచున్నవి! 105

ఆహ్లాదమునకై వినోదమునకై
వసంత వనమునకు వెడలినాను
ఎండ వేడిగా ఉండినది

గాలి జోరుగా వీచినది
ఆకులు గలగల రాలుచు ఉండినవి
పక్షుల పాటలకు మారు
గజిబిజి రొదలు వినబడినాయి
వ్యతిరేక వాతావరణము
ప్రత్యక్షమైనది ! 106

నిన్నటి సభలో నల్లకోటు
మీకు బాగా ఉండింది
కొన్నాళ్ల పిదప, నల్లకోటు
తెచ్చుకోలేదా అన్నది
ఆమె శ్రద్ధ నల్లకోటుకే
పరిమితమని తలచాను
మరి కొన్నాళ్ల పిదప-
ముఖము కమలమంతచేసి
నల్లకోటులో అందంగా ఉన్నారు అన్నది
శ్రద్ధ నాపైకూడ వ్యాపించిందని తలచాను. 107

నిన్ను ప్రేమిస్తున్నాను
గాఢంగానా ?
అవును.
పెండ్లి చేసికొంటావా ?
మౌనంగా ఉండి, పెండ్లి అయ్యింది
అని నెమ్మదిగా అన్నాను
పెండ్లిలో దొరకని ప్రేమను
బయట వెదకుచున్నారా ?
సిగ్గుతో వెదలిపోయాను. 108

పర్వతాలు గాఢంగా నిద్రించుచున్నాయి
మబ్బులు చల్లగాలుల వింజామరలతో
పిడుగులు రొదలతో
మెరుపులు తళుకులతో
మేల్కొలుప యత్నించాయి
కడకు, కోమల హస్తములతో
మబ్బులు పర్వత కపోలాల నిమిరాయి
పర్వతాలు మేల్కొన్నాయి
కొండవాగుల మందహాసాలతో ! 109

సముద్రాల నుండి ఎగిరి వస్తాయి
పర్వతాలకు పెద్ద నీటికొంగలవలె మబ్బులు
అక్కడే వాటి గూడు విడిది
విశ్రమించి వర్షించి ఎక్కడికి పోతాయో !
చల్లని స్నేహితులు క్షణకాలపు అతిథులు ! 110

దిగంత కవాటాల తెరచుకొని
నిశ్శబ్దముగ వస్తున్నాయి మబ్బులు
చీకట్లో నల్ల లారీలవలె
సరకులు దింపుకొని
ప్రయాణము సాగిస్తాయి, ఎచ్చటికో ! 111

స్వప్నలోక విలాసము సౌందర్యము
అందరినీ ఆకర్షించుతుంది
ఆహ్లాదపరుచుతుంది
ఏదో శుభ ముహూర్తములో
పులకితమగుతుంది
ప్రేమ మంత్రమును జపిస్తుంది
మధుర వేదనల పొందుతుంది. 112

ప్రేమలేని సౌందర్యము
సజీవముగ ఉండదు
గాలి పోయని వేణువువలె
వెలుగులేని ప్రదీపమువలె
మందంగా ఉంటుంది 113

మహనీయుల
క్రియారూపాన్ని గొన్న
శృంగారవాంఛల గూర్చి విన్నపుడు
మనస్సు ఒప్పదు
ఒప్పుకున్నా, వాస్తవాలను కాదనేదెట్లా ! 114

ఐదునాళ్ల ముసురువానల పిదప
ఉదయము లేతనవ్వులతో చిగిర్చింది
పక్షులు కలరవ గీతములతో
నవ్వినాయి
ఆకసమున హాసధారలు ప్రతిబింబించాయి
కొంగల బారులో. 115

ముంగిలిలోని విత్తనాలు
వర్షస్నానము చేశాయి
కోమల ఆతపములో ఆరవేసుకొన్నాయి
మట్టి చీకట్ల తెరవెనుక
ఎన్ని గిలిగింతలు పొందాయో
ఎన్ని గగుర్పాట్ల మైమరపుల పొందాయో
మరునాటికే రెండు రెక్కలతో
ఆకాశాన్ని చూచాయి, ఎగుర యత్నించాయి ! 116

పరిస్థితుల ప్రభావము క్రింద
విలువల పరిణామము
మారుచుంటుంది
వంద వకీళ్ల అభిప్రాయము
ఒక జడ్జీ తీర్పుకు సరిగావు
వంద ప్రాచార్యుల ఓటు
వెయ్యి రిక్షావాలాల ఓటుకు
సరితూగవు ఎన్నికలలో
వకీళ్లు ప్రాచార్యులు తక్కువవారు
కాదు గదా! 117

స్థూలంగ అన్ని మతాలు
నిత్యసత్యాలనే ప్రబోధిస్తాయి
ఎవరికీ ఏ ఆక్షేపణ ఉండదు!
లోతుకు దిగి సూక్ష్మంగ పరిశీలిస్తే
అన్ని వ్యత్యాసాలే. ఏ మతము ఒకటిగా లేదు
క్యాతలిక్కులు, ప్రోటెస్టెన్ట్లు
మహాయాన హీనయాన
సున్నీలు షియాలు
శైవులు వైష్ణవులు
దిగంబరులు శ్వేతాంబరులు
ఇంకా చాలా చాలా! 118

మూల సిద్ధాంతాల్లో ఐక్యతే
వివరాలలోనే వ్యత్యాసాలు!
సూత్రాల్లో ఐక్యతే
వ్యాఖ్యానాల్లో విభేదాలు!
ఆదర్శాల్లో ఐక్యతే

ఆచరణల్లోనే కలహాలు !
ఐక్యత, వ్యత్యాసాలు
పడుగు పేకలవలె
సర్వత్రా వ్యాపించియున్నాయి. 119
పశ్చిమాద్రి గుహలలో చేరి
సూర్యుడు సైగ చేయుచున్నాడు
సంధ్యాదేవిని !
ఆమె కపోలాలు రాగరంజితము కాగా
బయలుదేరింది అభిసారపథమున
చీకట్ల ముసుగులతో ! 120
శివుడు మన్మథుని ఓడించినది
తాత్కాలికముగా
మన్మథుడు శివుని ఓడించినది
శాశ్వతముగా
లేకున్న శివుడు పార్వతి పాదముల కడ వంగి
ఎందుకు అభ్యర్థన చేస్తాడు ? 121
ఆమెకు ప్రత్యుత్తరము వ్రాసిన పిమ్మట
ఆమె ప్రస్తాపన ఇక లేదు
ఆమెకు ప్రత్యుత్తరము వ్రాయనపుడు
వ్రాయాలె అంటు ప్రతిదినము
ఆమె ప్రస్తాపన వస్తూ ఉంటుంది
వ్రాసి మరచుట మేలా !
వ్రాయక సదా జ్ఞప్తికి తెచ్చుకొనుట మేలా
అనే విషమ ప్రశ్నను ఎదురుకొంటున్నాను. 122
ఆసుపత్రికి మంచి పేరు రావాలంటే
రోగులు ఎక్కువగ రావాలె

నయమగుతు ఉండాలె
ఒక ఊరిలో రోగులు లేకుండా
అందరు ఆరోగ్యముగ ఉంటే,
ఆసుపత్రికి చెడ్డపేరు !
పబ్లిక్ హెల్తు డాక్టరు సమర్థుడైతే
మెడికల్ డాక్టరుకు ఆదాయము తగ్గుతుంది ! 123

నేరాలున్నపుడే పోలీసువారి
సామర్థ్యము తెలిసేది !
యుద్ధాలున్నపుడే సైన్యము
వీరత్వము తెలిసేది !
లంచగొండితన మున్నపుడే
విజిలెన్సు వారి నైపుణ్యము తెలిసేది. 124

చంద్రుడు లేనపుడే
చీకటి రాత్రిళ్ల షోకు తెలిసేది
ముసురు మబ్బుల్లో సూర్యుడు లేనపుడే
ఎండల వెచ్చదనము తెలిసేది
నాయుడుబావ లేనపుడే
ఎంకి ప్రణయాలు తెలిసేది ! 125

నీ భావమే నీ అభిప్రాయమే
నీ మెదడులో నూరుగొంతులతో
పలుకుతుంది
అదే ప్రపంచ భావమని ప్రజాభిప్రాయమని
భ్రమించి పలుకుతావు ! 126

మోక్షానైనా వదలుతాడు
కనకాన్ని వదలలేడు

కనకాన్నైనా వదలతాడు
కామినిని వదలలేడు
కాసూన్నైనా వదలతాడు
పదవిని వదలలేడు
విలువల నిచ్చెనలలో పదవి స్థానము
అన్నిటికన్న మిన్న ! 127

దాదాపు అరగంట వేచి విసిగాము
పోదాము అన్నాడు స్నేహితుడు
ఆమెను చూడడానికి వెళ్లి
మన ఆనందములకై అలంకరించుకొని
దిగివస్తుంది ఆగు అన్నాను
ఆలస్యమైనదంటు వచ్చింది
సురభిళ సంధ్యాసుమముగానే కాన్పించింది
దిగివచ్చిన పౌర్ణమివలె ఉండింది. 128

కావాలనే కళ్లజోడు ఆమె ఇంట విడిచి
వచ్చినాడు !
ఇంటికి పోయి టెలిఫోనులో
ఆమెతో మాట్లాడడానికి
మరునాడు ఆమె ఇంటికి మరలిపోవడానికి
నెపము క్రింద వాడినాడు ! 129

ఇమామ్ హుసేన్ ఇస్లాం సంరక్షణకై
చనిపోయినాడు చాల కాలము క్రిందే
ఇప్పటికి దుఃఖ సూచనగా
40 దినాలు షియా స్త్రీలు
నల్లదుస్తుల వేస్తారు

అందమైన షియా స్త్రీలు ఆ దుస్తులలో
ఇనుమడించిన అందముతో కాన్పిస్తారు. 130

వయస్సు మళ్లగా
ఒకసారి వైద్యుని మందుల చేతిలో పడితే
నీ బ్రతుకు సీసా
ఓడుపోయిందని తెలుసుకొంటే మేలు ! 131

నీ కష్టాలలో
ప్రపంచమంతా జాలి చూపాలని
ఊరడించాలని కోరుతావు
ప్రపంచానికి అంత హృదయకోమలత్వము లేదు !
తీరిక లేదు !
నీ కష్టాల కొలనులో
నీవే మునిగితేలాలె ! 132

నీవు చదివినది నీకు నచ్చినది
పుస్తకము ఇయ్యి, తిరిగి ఇస్తాను
అని కోరాను
హాస్యప్రదమైన పుస్తకాన్నే ఇచ్చింది
నా నవ్వులో ఆమె నవ్వును చూచాను
ఆమె ఆనందములో నా ఆనందము
ప్రతిబింబాన్ని చూచింది !
ఆ పుస్తకమున్నన్నాళ్లు
ఆమెను చూస్తూ వచ్చాను ! 133

వయసు ముదిరేకొద్దీ
చెవి నరాల నెత్తురు తగ్గుతుందేమో
ముక్కు నరాల నెత్తురు హెచ్చుతుందేమో

చెవి వినడం తగ్గింది
ముక్కు వాసన చూడడం హెచ్చింది ! 134

జీవిత మాధుర్యము చవిచూడాలంటే
దారిద్ర్యపు అమృతాన్ని చవిచూడాలా !
సిరిసంపదల విషాన్ని వదలివేయాలనా !
లేకున్న జీవితము వికృతమగుతుందా !
హృదయము తిక్తమై, విషరక్తాన్ని
క్రక్కుతుందా ! 135

విహంగముల పక్షముల
బంధించి
రమ్యమైన వసంతోద్యానవనమున
వదలుట పాడియా !
కిసలయములు కోరకములు
ప్రసూనములు దక్షిణ సమీరముల
గీతములకు నృత్యము సల్పుచున్నవి
సుగంధ సంగీత స్వరములతో
ఆహ్వానించుచున్నది
పక్షి అశ్రువుల రాలుస్తున్నది. 136

పురాతన వైభవ ఇతిహాసమును
మేల్కొల్పే వేషములలో ఆభరణములతో
ముస్లిం యువతులు నాజూకుగ
సలాం చేసిరి మహారాణికి
శతాబ్దాల సౌందర్యము మూర్తీభవించెను
ఆ స్వాగత శాలలో ! 137

నల్లని వేషముతో
నిగనిగలాడు కుంతలములతో
ఆమె ముఖబింబము
అమావాస్య గర్భమున జనించిన
పౌర్ణమివలె నుండెను. 138

ఎప్పుడూ ఆమెను అలంకృతగానే చూచాను
ఈనాడు ఆమెను సమయ నిర్ణయము
లేకుండ చూచాను
సహజ సౌందర్యముతో
మధ్యాహ్న కమలమువలె ఉండినది
కృత్రిమములైన పూతలతో
పెంపులతో కాక
నిసర్గ సుందరముగ కాన్పించింది. 139

ఈనాళ్లలో నౌకర్లకు కొరత
ఇష్టమున్నపుడు వస్తారు
వలసినపుడు నిలుస్తారు
నౌకరే యజమానులు అన్నారు
చేయెత్తి దండము పెట్టుచు
మరికొందరు నౌకర్ల విషయాలే
మాట్లాడుకొంటారు!
వారిని ఉంచాలేము
వదలాలేము! 141

పని ఉన్నపుడే నీవు నిలువ
పెట్టినావే అని అడిగింది పనికత్తెను
నా ఇబ్బందులు నాకు ఉన్నవి
నాలుగునాళ్ల సెలవు పెట్టాలనుకొన్నాను

కాని పెట్టక, నేడే వచ్చేశాను
దానికి సంతోషించండి అన్నది వంటకత్తె
తర్వాత ఏమి అనాలో తెలియలేదు! 141

మీకు క్రొత్త ఏమున్నది అలవాటే గదా!
నిన్నటి సభలో బాగా మాట్లాడినారు అన్నది
మేము సర్వస్వతంత్రులము గదా
ఏదో బిగ్గరగ అరుస్తాము అన్నాను
కాదండి, చక్కగ ఆవేశంగ మాట్లాడారు అన్నది
సంతసించాను. 142

ఆశ్రమాల్లో ఉంటుంది
ప్రవచనాలు వింటుంది
కాని, పాత రాజకీయ కోపాలు
మాత్సర్యాలు ఆమెను వదలవు!
కృష్ణ రామా అనుకోవలసిన వయస్సులో
కోపాలు తాపాలు ఎందుకో! 143

మనస్సు శాంతిని కోరుతుంది
హృదయములో దాగిన కోపభావాలు
ఎక్కడికి పోతాయి!
వాన పడ్డప్పుడు పచ్చి గడ్డివలె
అదునుకై వేచి బయట
పడుతుంటాయి! 144

మీరు భోజనానికి వస్తున్నారన్నమాట అన్నది
క్రొత్త రకమైన పిలుపుగ తోచింది
ఏమి చెయ్యాలె. నేను ఒప్పుకొన్నాను గదా!
నా మొండితనానికి నేనే ఆశ్చర్యపోయాను!
జీవిత యాత్రలో

నీడలకన్న ఎండలే ఎక్కువయని
తృప్తిపడ్డాను
ఆదరమునకు తక్కువ ఏమీ కాలేదు. 145

కానుకలు ఇచ్చేటప్పుడు
ప్రసన్నంగా ఉంటుంది
పుచ్చుకొనేటప్పుడు
అప్రసన్నంగా ఉంటుంది ?
కానుక నచ్చలేదా అంటాడు
ఇచ్చే స్నేహితుడు
ఏమి తరుణమని కష్టపడి తెచ్చారు
అంటుంది ఆమె
ఇచ్చేటప్పుడు ఆమెకు కలిగిన
సంతోషాన్ని మరుస్తుంది ! 146

కోరికలే సోపానాలు
క్రిందికి పైకి నడిపించగలవు
అవే పానపాత్రలు
హృదయ రక్తాన్ని నయనాశ్రువులను
అందియ్యగలవు !
చల్లని తేనెను వేడి పాలను
అందియ్యగలవు ! 147

సూర్యచంద్రులకు సమయభేదము
బండ్లకు ఓడలకు ప్రదేశభేదము
ఒక ఒరలో రెండు కత్తులు దాగలేవు
ఒక ఇంటిలో ఇద్దరు భార్యలు ఇమడలేరు
ఒక కుర్చీలో ఇద్దరు అధికారులు కూర్చోలేరు ! 148

సమానులు విరోధులు
డిక్టేటరులకు ముఖ్యమంత్రులకు
అభిమానులు కావాలె!
అనుయాయులు కావాలె!
స్తుతి పాఠకులు కావాలె,
పతాక వాహకులు కావాలె! 149

మరుగుజ్జుల రాజ్యములో
ఏలికలు నాయకులు
కొరతల రాజ్యములో
ప్రచారకులు నాయకులు
ఆపదల రాజ్యములో
ప్రబోధకులు నాయకులు
ఆకలి రాజ్యములో
అప్రమత్తులు నాయకులు
ఉన్నదానిని మరుగున పెడతారు!
లేనిదానిని ఎలుగెత్తి చాటతారు
లేమిమీద వ్యాపారము చేస్తారు! 150

వ్యాపారములో సాహసము
లేకుంటే లాభము లేదు
అతిసాహసము అధిక లాభము
వాటుతప్పితే అధిక నష్టం
ఇటో అటో తేలాలె
శూన్యములో వ్రేలాడలేదు! 151

పసికట్టుచు పొంచి ఉంటాడు
ఎరకై పులిమాదిరి
పెక్కు మడుగులలో గాలము వేస్తాడు

చాలకొలనులలో వలను విసురుతాడు
ఏ హరిణమో, మీనమో చకోరమో
దొరుకుతుందను ఆశతో
దేహమంతా అక్షిచేసి చూస్తుంటాడు
ఏ లోలాక్షి చేజిక్కలేదు ! 152

డిసంబరులో
మద్రాసు వేషముతో ఢిల్లీ పోవడము
ఢిల్లీ వేషముతో మద్రాసు రావడము
వింతేకాదు, ఇబ్బంది కూడ !
చావు ఇంటికి నవ్వుతు పోవడము
పెండ్లి ఇంటికి ఏడుస్తు పోవడము
అనుచితము, అదను తప్పిన పని
కాలానుగుణముగా వర్తించాలె ! 153

కొందరికి
నవ్వుకన్న చిరునవ్వు అలంకారముగ ఉంటుంది !
చిరునవ్వుకన్న నవ్వు కొందరికి అందం !
నవ్వినపుడు ముఖమంతా వికసించి నట్లుంటుంది
హృదయమే వెలుగును పొందినట్లుంటుంది 154

ఆస్తే మనకు శత్రువగుతుంది
కొడుకులతో తగాదాలు రావచ్చు
ముస్లిములకు చరిత్రే శత్రువైనది
విస్తారమైన రాజ్యము పోయిందని
ఆక్రోశము నిరుత్సాహము
బ్రాహ్మణులకు శాస్త్రాలే విరోధమయ్యాయి
భూసురులని ఘోషించినందున

శాస్త్రిలకే ముప్పు వాటిల్లింది
ఏది పైకి ఎత్తిందో, అదే క్రిందకు త్రోసింది! 155

జంతువులు రెండు రకాలు
చంపి మాంసము తినేవి
చంపక ఆకు అలముల తినేవి
రెండు స్వభావాల నంచి మానవుడు
చంపక శాంతి సమావేశాలంటాడు
చంపి విశ్వశాంతికై ప్రజాస్వామికమునకై అంటాడు
విశ్వశాంతిలో సమరాల రుధిరము
పీలుస్తుంటాడు!
సమరాల మారణ పానశాలలలో
విశ్వశాంతి మదిరమును
అనుభవిస్తుంటాడు! 156

నిశీథిని నిండుచూలాలు
తూర్పుదిశ సిద్ధపరచింది
పసిడి ఉయ్యేల!
నక్షత్ర సందోహములు మరుగగుచున్నవి
ప్రసవించిన శిశువునకు
బంగారు ముఖము వెండిచేతులు. 157

బిడ్డ పెదవుల ఉయ్యేలలో
నిదురించిన నవ్వు మేల్కాంచినది
చూపుల చేతుల ఆడించుచు మేల్కొన్నది
ఆకొని, ఏడుపు పిలుపులతో
రమ్మన్నది తల్లిని
మాతృ సంతప్త స్తన్యముల క్రోలి
నిదురించినది నవ్వు 158

ఎండల శిరమున తాల్చి
చెట్లు నీడల నిస్తాయి
దారులవెంట చెట్లు నాటడం
పండ్లకు కాదు నీడల కొరకే
ఎడారుల్లో నీడలు లేవు
ఎండల ఏలుబడి
ఎండమావుల మాయసైగలే !
రాత్రిళ్లే ప్రయాణకాలాలు. 159

తననీడ తన్ను వదలదు !
ఎండలో పుట్టి ఎండలో చచ్చి
తోడుగా ఉంటుంది
ఎండనుండి కాపాడదు
వాననుండి తప్పించదు
ఉపయోగపడని ఆస్తిగా ఉంటుంది
చెల్లని నోటుగా ఉంటుంది ! 160

వారు విడాకులు ఎందుకు కోరారో
ఇద్దరు మంచివారే అన్నది
ఇంటి పనులలో ఏమి పట్టింపులో
సొంత స్వభావాల్లో ఎంత
మొరటు వాదులాటలో
సమాధానము దొరకని ఎన్ని
చిక్కు ప్రశ్నలో !
కాన్పించేదే కాదు నిజము
కాన్పించనిది కూడా నిజమే !
మంచివారికీ రహస్య కోణాలున్నాయి ! 161

ఈసారి అభియోగాలు లేకుండ
తప్పించుకొన్నాను అన్నది
తప్పించుకొన్నావు, కాని
తప్పులు లేవని కాదు
జ్ఞాపకాల పొదిలో ఉంచుకొన్నాను
వలసినపుడు ప్రయోగిస్తాను !
చూస్తువులే అన్నాను ! 162

వేదాంతీ, నీ మాటలు వినేది
ఎవరు ఈ సభలో
నీకు పరిచితమైన సభకాదు
అది మారిపోయినది
క్రొత్త యుగములో, మాకు
పాతమాటల వల్లించుచున్నావు
ఎందుకు నీకు కంఠశోష
మాకు కర్ణశోష ! 163

రాజవేషములకు తగు
వస్త్రములతో వచ్చితివి
రాజులు లేరు- భూతకాల ఇతిహాస
గ్రంథాలలో తప్ప !
బాల్యయుగము మారి
కౌమార యుగమైనది
యుగముఖము వికసించింది
నీ వస్త్రముల పురాతన శవములకు
కప్పుము. 164

నేతా : జనఆక్రోశముల కంఠమైతివి
వారి ప్రాచీన వీరగాథల పాడితివి

వర్తమాన దీనత్వమును ఘోషించితివి
భవిష్యత్తు ఆశాస్వప్నముల చిత్రించితివి
నీ సందేశము ఏడ్పించునదా !
ముందుకు నడిపించునదా ? 165

కాలానికి ఏమి కావాలె
కవియా కవిత్వమా ?
జీవిత వివరాలా లేక
కవితా శిల్పమా
కవి వెంటకొనిపోయినాడు
జీవితాన్ని
వదలివెడలినాడు కవిత్వాన్ని
ఒకటి నశ్వరము, మృతము
ఒకటి అనశ్వరము, అమరము. 166

మన ప్రాచీనులు
అజ్ఞాత యవనిక వెనుకే కార్యాల సాధించారు
తమ అస్తిత్వము తత్కాలీనమని తెలుసు
తమ శిల్పాల వేదికమీదే ముసుగులతో
నిలబడతారు
శతాబ్దాల శిఖరాల మీద
ఎగురుతుంధి శిల్పకేతువు. 167

బౌద్ధమతము దాటింది
సముద్రాలను పర్వతాలను
క్రైస్తవ మతము ప్రాకింది
ప్రపంచ సరిహద్దులకు
ఇస్లాం మతము ఆక్రమించినది
ఆఫ్రికా ఎడారుల జావాద్వీపాల

హిందూమతము కదలక మెదలక
హఠయోగములో కూర్చున్నది
వర్ణాశ్రమ జపమాలను త్రిప్పుచు కూర్చున్నది! 168

పాండిత్యము సుమసౌరభము వంటిది
వాక్చైపుణ్యము సహాయపడాలె
పరిమళము వ్యాపింపదు
వాయు సహకారము లేకున్న
మెదడు నాలుకమీదే
రాణిస్తుంది. 169

అంతఃపుర రహస్యాలు బయటవేసేది
పరిచారికలే!
నందనవన రహస్యాలు బయటవేసేది
పుష్పపరిమళాలే!
దుర్గ రహస్యాలను బయటవేసేది
గూఢచారులైన ఆప్తమిత్రులే!
నాయకుల రహస్యాల బయటవేసేది
దిన వార పత్రికలే! 170

తుషారస్నాతయగు ప్రభాత ప్రసూనము
బాలార్కుని దర్పణములో చూచుకొని,
హేమంతికా ధవళ వస్త్రముల ధరించి
మధుకర సరస వచనములకు
తల ఊపుచు నవ్వుచున్నది! 171

అంతర్జాతీయతలో జాతీయత
గుటకలు వేస్తుంది
జాతీయతలో మతము
అడుగున పడుతుంది

సభలలో రాణించేది జాతీయత
ఇంట ఒంట పెత్తనము చేసేది మతము : 172

జాతీయత భౌగోళికమైనది
సీమలు సరిహద్దులు ఉంటాయి
ఆ తీరములో అన్ని మతాలు మునగాలె
మా దేశము మా ప్రజలు
అంటూ ఉండాలె : 173

జాతీయతలో అంతర్భాగము
భాషాభిమానము
వికసిస్తే పుష్టినిస్తుంది
వక్రిస్తే సంకుచితమగుతుంది
ప్రమాదాలకు పునాదుల వేస్తుంది
ఆంధ్రమాత, వంగమాత, మహారాష్ట్రి
మాతల మధ్య
భారతమాత ఆవిరియై ఆకాశానికి
పోతుంది. 174

ప్రజాస్వామికపు వడగాలిలో
మతము రెక్కలు దెబ్బ తింటాయి
చేరవలసిన గూటికి పోలేకపోతుంది
చిన్న మతాలవారి భయాలు పెద్దవి
వారి ధర్మము, సంస్కృతి మరుగున
పడునని ఆందోళన : 175

ఎన్ని మతాలు ఎన్ని భాషలు ఎన్ని రాష్ట్రాలు
తిరుగుచున్నవి భారత రంగుల రాట్నములో
ప్రతిదానికి ప్రత్యేక విశిష్టత ఉన్నది

ఈ విశిష్టత స్వరములలో
సమన్వయ సంగీత శ్రావ్యతను
ఉత్పన్నము చేయాలె. 176

కేంద్ర ప్రాంతీయ నాయకత్వములలో
నిరంతర సంఘర్షణ తప్పదు కాబోలు !
తల్లి కూతుళ్ల మధ్య వాదోపవాదాలు
ఎన్నటికైనా ప్రమాద హేతువు లగుతాయి. 177

భారతవర్షము ఎప్పుడు ఒక్కటిగా ఉండినది
బ్రిటిష్ హయాములో తప్ప ?
స్వరాజ్యము వచ్చిన పిదప
ప్రాంతాలు ఇంకా దగ్గర అయినాయి. 178

విచ్ఛేద బీజాలు పలుప్రాంతాలలో
నాటుచునే ఉన్నారు
శిరము బలిసి అవయవాలు
క్షీణించినా ఆరోగ్యము కాదు
అవయవాలు బలిసి శిరము
క్షీణించినా ఆరోగ్యము కాదు 179

సమన్వయమే ఉచితము
సరియగు మార్గము
కాని నిత్యసంఘర్షణలలో 
సమన్వయభావము సన్నగిల్లిపోదా !
కొట్టగ కొట్టగ కొండైన తరగదా ! 180

భవిష్యత్తుకు భూతకాలము
మార్గదర్శికాదు

చరిత్ర సరియగు పాఠము నేర్పింది
నిరాకరించవలసిన పాఠముల
కాని, మనము భూతకాలపు పలక వ్రాతల
చదువ లేకున్నాము
చదివినట్లే నటించుచున్నాము ! 181

జనాభా జటిల సమస్యగ ఉండగా
భాషలు మతాలు రెండవ పెద్ద చిక్కుగ
తయారగుతాయి
చరిత్ర పునరావృతమగుతుందా
అట్టి గుంటలో పడకుండ తప్పుకొంటామా
ఏమైన వర్తమానము సంతోషదాయకముగ లేదు
భవిష్యత్తు మనల శపిస్తుంది ! 182

వర్తమానమును పూజించేది
ఎన్నికల నాయకులు
భవిష్యత్తును ఆకాంక్షించేది
రాజకీయ ధురంధరులు ?
భవిష్యత్తు సంక్షేమమును
వర్తమాన తాత్కాలిక విజయాలకు
బలి ఇస్తాడు. 183

జాతీయతకు మతానికి
సంఘర్షణ వస్తే మతము గెలుస్తుంది
మతానికి భాషకు సంఘర్షణ వస్తే
భాష గెలుస్తుంది
భాషకు కులానికి సంఘర్షణ వస్తే
కులమే గెలుస్తుంది

ఎందుకో కులానికి అంత శక్తి!
ఇది మన దేశపు ప్రత్యేకత! 184

చదువుకొన్నవారము
బుద్ధితో తర్కించేవారము
దేశాలు తిరిగినవారము
కులతత్వాన్ని నిరసించేవారము
కుమార్తె పెండ్లికి కులాన్నే
ఎన్నుకుంటాము
అన్ని చెట్లు తల వంచుతాయి
కులతుఫాను వద్ద! 185

నావి మారెడ్డిగారివి కలిసి
నూరు ఆవులున్నాయి
అందులో నీవెన్ని బాబూ అని అడిగితే
అది ఎందుకులేండి, ఒక ఆవు దూడ లున్నాయి! 186

భాషాతీతమైనది విజ్ఞానము
దేశకాలాల అధిగమించేది
తెలుగువాడైనా మన శాస్త్రజ్ఞుడు
భాషాతీత భాషలోనే మాట్లాడుతారు
అందుకే దేశ విదేశములలో సన్మానిస్తారు. 187

విజ్ఞాన రహస్యాలు వైద్యఔషధాలు
మానవులే కనిపెట్టాలె
అవి అపౌరుషేయాలు కావు
ఏ ఋషో మునో యోగో
పలికేవి కావు
ఆకాశవాణి ఘోషించేవి కావు

ప్రయోగశాలల్లో ఏండ్లు పూండ్లు కష్టించి
మానవులు కనుగొనవలసినవే
అదీ, ఒక్కొక్కరి అదృష్టము ! 188

పూర్వదిశా వైభవ వంచితుడను నేను
ప్రాతఃకాల ఉదయరాగ వైచిత్ర్యముల
కాంచలేను !

నా అభిమాన శుక్రతార
వేకువ ఒయ్యారముల
తిలకించలేను !

సూర్యోదయ చంద్రోదయములకు
అంధుడను

మా గృహము పశ్చిమ ముఖ
పూజారిణి ! 189

పశ్చిమ కవాటాలు నాకు
తెరువబడ్డాయి
ఆధునికతకు విజ్ఞాన ప్రగతికి
సంకేతము పశ్చిమము
పశ్చిమాకాశము ఊదే శంఖారావము వింటాను
సంధ్యా స్నానార్థము సూర్యుడు
పశ్చిమ తోయములలో
ఈదులాడుట చూస్తాను
తారావధువులు ధవళ వస్త్రములతో
వెలుగులలో కరిగిపోవుట చూస్తాను
ప్రకృతి ఉచిత పరిహారమే ఒసగినది 190

మరణము నుండి ఆరువు తెచ్చుకొన్న జీవితానికై
ప్రేమను ఇస్తాడు, పాటల నిస్తాడు
పరోపకార స్వభావాన్ని ఇస్తాడు
ఉన్నదేగదా మనము ఇయ్యగలిగేది ! 191

నిత్య భయకంపితలు నక్షత్రాలు
తెల్లవారే దోపిడీలు వస్తారు
దీప్తి ఆభరణముల వలచివేస్తారు
వేడి జైలులో పడవేస్తారు
ముఖముల చీకటి ముసుగులలో
దాచుకొని ఏడుస్తుంటాయి నక్షత్రాలు. 192

రేపు ఆమె పుట్టినరోజు
ఆమెకు కోరదగినది, ఇయ్యగలిగినది ఏమి ?
శుభాకాంక్షలా ?
నా శుభాకాంక్షలకు విలువ ఏమి ?
నేనేమి తపస్సంపన్నుడినా ?
రాముని భార్యకు శుభాకాంక్షలు
కోరబడినవా ? 193

పుష్పములు పోతేగాని ఫలములు రావు
ఒక్క సూర్యుడు సహస్ర నక్షత్రాలను చంపుతాడు
నక్షత్రాలు పోతేగాని సూర్యుడు రాడు
ఒకరి మరణమే
మరొకరి జననము
శిశిర మరణమే వసంత జననము ! 194

ప్రజాభిప్రాయము ఏకకంఠముతో పలుకదు
నూరు కంఠములలో వినబడుతుంది

పుడమి తోటలో నూరునెమళ్ల
వాయసాలు కేక లిడినట్లుంది
ఏ రెండు గ్రహాలు ఒకే వలయములో
పరిభ్రమించవు ! 195

ముంతాజ్‌బేగం దాంపత్య జీవితం 19 సంవత్సరాలు
14వ శిశువుని కని మరణించింది
మరణించి సౌందర్యాలరాశి
తాజ్‌మహల్‌ను కనినది !
బ్రతుకు చావులు కనుటలోనే నడిచాయి ! 196

భూతకాలాలు చనుచు వదలిన
సుగంధమే ఇతిహాసము !
దేశానికి నగరానికి భవనానికి
ఉండవచ్చు ఇతిహాసము
అలహాబాదు ఆనందభవన్
ప్రతి శిలలోను స్వాతంత్ర్య సమర
ఇతిహాసము లిఖింపబడియున్నది. 197

రవీంద్రుని శాంతి నికేతన్
ఆధునిక సాహిత్యము కళలకు
కేంద్రమై కళాగంగోత్రిగ వెలసినది
ఎందరెందరో మహామానవులు
మనీషులు కళాతపస్సుల కావించిరి
సాలవీథికలు సంగీతమును ముఖరిస్తాయి
కళను ప్రతిబింబిస్తాయి ! 198

మనుష్యుల మాదిరే ప్రదేశాలు
పాపపుణ్యాల చేస్తాయా ?

నదీ తీరాన ఆశ్రమము
కారాగారము ఉన్నాయి
ఒక చోటన పుణ్యాత్ములు
సమావేశమగుతారు
ఒకచోటున యమపురివాసులైన
పాపాత్ముల నివాసము. 199

సాహిత్యములో వివిధ ప్రక్రియల మాదిరి
కారాగారాలలోను ప్రక్రియలున్నాయి
సమరములో చిక్కిన శాత్రవవీరులను
బంధించే జైళ్లు
ప్రజాసంక్షేమమునకే ఉద్యమాలలో చేరి
నిర్బంధింపబడిన జైళ్లు-
నేరమునకై శిక్ష విధింపబడిన జైళ్లు-
సాంకేతికముగా నేరాలు చేసినవారి జైళ్లు
తాత్కాలిక ఆవేశములతో
నేరాల చేసినవారి జైళ్లు-
పదేపదే నేరాల చేసేవారి జైళ్లు
జైళ్లపాటలు రాగమాలికలో ఉంటాయి
పుణ్యరాగాలు పాపరాగాలు ! 200

స్పీకర్ అయ్యాక ఉత్సాహంగ
తిరిగి యౌవన మొచ్చినట్లున్నది
అన్నాడు సాంబమూర్తి ఢిల్లీ మిత్రగోష్ఠిలో
మన అసఫ్ ఆలీని కూడ
స్పీకరు చేయకూడదూ
అన్నది అరుణ ఆసఫాలి ! 201

నిన్న సాయంత్రము సాంబమూర్తితో కూడ
సినిమాకు వెళ్లాను
అన్నది కమలాదేవి
బొంబాయి కాంగ్రెసు సభాషణలలో
ఆర్ యు సోఫారు అప్ అన్నాడు
కాంగ్రెసు ప్రెసిడెంట్ నెహ్రూ. 202

సినిమా ప్రఖ్యాతితో
రాజకీయాల కొమ్మమీదికి
విజయవంతముగ ఎగిరారు
రాజకీయాల అగ్రశిఖరాల
అందుకొన్న సంజీవరెడ్డి
సినిమా కొమ్మమీదికి ఎగిరితే
ఎట్లా ఉంటుంది అని అడిగింది ఆమె
కమ్మలతో కూడ అయితే
బాగుంటుంది అవి అన్నాను
నవ్వుకొన్నాము. 203

తాటిచెట్టు బీదల కల్పవృక్ష మన్నారు
తేగలు మొదలు కల్లు వరకు
బుర్రగుంజు మొదలు ఆకుల
మట్టలు వరకు పనికి వచ్చేవే
బీద దేశము కాబట్టి
అసలు కల్పవృక్షము ఎగిరిపోయింది !
తాటిచెట్టు మాత్రము మనకు
భద్రంగా మిగిలి ఉన్నది ! 204

క్రొత్త స్థలపు త్రవ్వకాలలో
లోతున బంగారు నాణ్యాలు దొరికాయి
కొన్ని శతాబ్దాల నాటివని నిర్ణయించారు
ఎప్పుడు పూడ్చిపెట్టారో
ఎంత ఇతిహాసము నడిచిందో
నాగరికత ఎంతమారిందో
మానవత ఎంత వికసించిందో
తలచుకొంటేనే గగుర్పాటు కలుగుతుంది ! 205

శ్రీ మహావిష్ణువు భార్య
శ్రీ మహాలక్ష్మి వచ్చేటప్పుడు
ఒంటరిగా వస్తుందా ?
ముందే చపల చంచల
అరణపు పనికత్తెలతో వస్తుంది
గర్వం, ఈర్ష్య, దుష్టసహవాసాల
వ్యసనాలతో వస్తుంది ? 206

అలవికాని సంపద
బహు సంతానము
ఇంట్లో చేరినపుడు
సమస్యల గుడ్లు పొదుగుతాయి
తొందరలు రెక్కలు తొడుగుతాయి
విరక్తి అంబరములో మనస్సు ఎగురుతుంది
వానప్రస్థములో గూడు కట్టుతుంది ! 207

సహోదరులు లేరని
ఒక్క కూతురని పెండ్లాడినాడు
పెద్ద ఆస్తి చేకూరింది

అందరు చనిపోగ
అమ్మ దగ్గర చేరింది
నా తర్వాత కుమార్తెను
ఎవరు చూస్తారని విలపించింది తల్లి
ఐశ్వర్యపాదాల
ఆశంకల క్రందనలు తరుముచున్నాయి
కలిమిలోను సమస్యలు దుముకుచున్నాయి. 208

నీళ్లతో నిండిన కొలనులలో
తమ ప్రతిరూపును చూచుకొని
మబ్బులు సంతోషించాయి
మెరుపులతో నవ్వినాయి
తమ తలిదండ్రులకు నిలకడలేదు
ఆకారము లేదు అంతా ఆవిరి
అని ఉదకాలు తేలికగ చూచాయి
చిన్న అలలతో పరిహసించాయి ! 209

మూడునాళ్ల వాన పిదప
వాయుగుండం ముగిసిందని
ఎండ వెలుగుజండాతో ప్రకటించింది
నాకు ఇంకా ఊపిరి ఉన్నదని
చూపుటకు
మళ్లీ మబ్బులు చేరాయి
ఎగ ఊపిరితో సన్నగ వర్షించింది
కాళ్లు ఈడ్చుకొంటు ! 210

ప్రశంసల క్రుమ్మరిస్తున్న స్నేహితునితో
నేను లేనపుడు ఏ పనులు
మిగిలిపోతాయి అన్నాడు గాలిబ్

వర్షము జోరుగా కురుస్తున్న
నా ఏ పనులు మిగిలిపొయ్యాయి
అని నేను అడిగాను, కారు చేతిలో ఉన్నదిగాన : 211

సిరిసంపదలు ఊరి
పొంగుతున్న దినాలలో
అసహనాలు, కోపాలు, గర్వాలు
గంటల మ్రోగిస్తాయి
ఒంటెల ఎడారి ప్రయాణాల్లో వలె
అన్నీ వరుసలో నడవాలె
ఏది తప్పిన తప్పిపోతుంది
నీరు దారి లేని ఎడారుల్లో
సిరిసంపదల నమ్రతకు
తల వంచి నమస్కరించాలె : 212

సముద్రాలు దాటుటకు
ఓడలు కావాలె
ఎడారుల దాటుటకు
ఒంటెలు కావాలె
ఒంటెలకు గంటలుండాలె
కారుకు హారన్ ఉండాలె
సంఘానికి సంస్కృతి ఉండాలె
కవితకు భావము ఉండాలె. 213

శ్రావణ సంధ్యలో ఉత్తర దక్షిణముల
సేతువై కాన్పించే ఇంద్రధనుస్సు
క్రింద ఆడే నెమలిని చూచి నవ్వింది
ఎంత ఎత్తులో ఉన్నాను ఎన్ని రంగులు
ఎంత గొప్పదాన్ని నేను అని

నెమలి నృత్యములోనే నిమగ్నమై ఉండింది
పైకి చూడకనే
ఇంతలోనే రంగులు మాశాయి
నవ్వీన హరివిల్లు అదృశ్యమైనది
నెమలి పింఛాన్ని ముడుచుకొంటూ!
ఇంతలోకే ఇంత విర్రవీగా
అని చెట్టుమీదికి ఎగిరింది
అల్పుల అధిక అహంకారాలు
అతిశయోక్తుల ఆర్భాటాలు. 214

ఇంద్రధనుస్సులు
దీపావళి మతాబులు
మబ్బుల మెరుపులు
రాజకీయ అంతస్థులు
వెల్లువ నీటిబుడగలు
క్షణప్రభలని మరుస్తుంటాయి!
నిత్యాలని, సత్యాలని తలుస్తుంటాయి! 215

డాక్టరుగారూ, మీకు అన్నీ తెలుసు
రోగాలు జ్వరాలు
వృద్ధాప్యపు సంగతి మీకేమి తెలుసు
ఇంకేమి లేకున్న, కొన్ని జ్ఞాపకాలు
అనుభవాలు ఉన్నాయి గదా? 216

దేవుడు లేడంటాడు
మతములో విశ్వాసము లేదంటాడు
ఆచారాలు గ్రుడ్డి అపచారాలంటాడు
హేతువాదముతో చూడాలంటాడు
కులాన్ని వదలలేక

దాని ఉయ్యేలలో ఊగుతు
తానెంత ప్రగతిశీలిని అని నవ్వుతాడు ! 217

ఇంట్లో అంతా పాశ్చాత్య వైఖరులే
భోజనము టేబిల్ వద్దే
వేషం సూట్ పై లోనే
పిల్లల చదువులు కాన్వెన్ట్సులోనే
సభల అజెండా తెలుగై ఉండాలని
ఆక్షేపిస్తుంటాడు సభలలో. 218

మతము కొరకు మనమా
మనకొరకు మతమా
భాషకొరకు మనమా
మనకొరకు భాషా
నేటి ఆధునికులు నిర్ణయించుకోలేకున్నారు
ప్రాచీన సంస్కృతి అనేవారే
వైజ్ఞానిక దృక్పథము అంటారు
ఇది సంధియుగమా !
సందిగ్ధయుగమా !
కాని, కాలము ఎవరి అనుమతి లేకనే
మారుకొంటూ వస్తున్నది. 219

వివాహితుల అన్యప్రేమ పత్రాలు
వ్యభిచారాహ్వాన పత్రికలే !
వ్యభిచార ఉద్యోగ యాచికలే !
పాపసంకల్పాలు ప్రశంసా వాక్యాలతో
నిండి ఉంటాయి. 220

స్ఫులింగాల తర్వాత తుషారాలు
వేడుల తర్వాత చలులు
కష్టాల తర్వాత సుఖాలు
పడుగు పేకలవలె
బ్రతుకు బట్టను అల్లుచుంటాయి
ఆమె పంచకము రామాయణమైతే
స్ఫులింగాలు తుషారాలు
ముక్తకాల ఉత్తర రామాయణము! 221

సెప్టెంబరు 1983 } మధ్యలో
మార్చి 1984

# బెజవాడ గోపాలరెడ్డి

పుస్తకాలు

**వేయి సోయగములు**

'ఆమె' పంచకము

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె బెణుకులు (1982)

**శతకవితలు**

'కవితా' పంచకము

6. కాలవాహిని (1979)
7. సాహిత్య సుందరి (1980)
8. ప్రసూన మంజరి (1981)
9. పరిమళ తరంగాలు (1982)
10. సాగర సమీరాలు (1983)

**స్ఫులింగాలు - తుషారాలు**

❀

**రానున్నవి**

మలయ మారుతాలు
(వివిధాలు)

**అనువాదాలు (ఉర్దూ నుండి)**

ఇక్బాల్ ఫిర్యాదు - జవాబు
ఇతర కవితలు
ఆత్మగరిమ

**బెంగాలీ నుండి (రవీంద్రునివి)**

1. రవీంద్రుని నాటికలు
(6 పుస్తకాల సంపుటి)
2. కథలు - కల్పనలు
3. వానచినుకులు
4. ఊర్వశి - కాళిదాసు
5. నైవేద్యము - స్మరణ
6. తాజ్‌మహల్

పద్మా పవర్ ప్రెస్, కుత్బిగూడ, హైదరాబాదు - 500 027